Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 35 • 24-8-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కంటి మీద కునుకులేని మంత్రులు!

## అంతా ఢిల్లీ 'మాయ' తప్ప తానేమి చేయలేనన్న సిఎం!

మంత్రులలో కాక పుట్టింది. తమ కాళ్ల క్రిందకు నీళ్లు వస్తున్నాయన్న భయం కల్గింది. మోపిదేవి వెంకటరమణ చెరసాల పాలైనప్పుడు ఈ కదలిక లేదు. బిసి మంత్రి కావడం, వెనుకా ముందు దన్నుగా నిలిచే నేతలు లేకపోవడం మోపిదేవి దురదృష్టం. అందువల్లనే సహచర మంత్రులు మర్యాదకు కూడా జైలుకు వెళ్లి ఆయన్ను పరామర్శించలేదు. చాలా నిర్లిప్తంగా వుండి పోయారు. కానీ ధర్మాన ప్రసాదరావు మీద సిబిఐ ఛార్జిషీట్ మోపడంతో అందరూ ఉలిక్కి పడ్డారు. రేపు తమ గతీ ఇంతేకదా అన్న భీతికి లోనైనారు. ఎట్లయినా సిబిఐ వల నుంచి తప్పించుకోవడానికి మంత్రాంగం మొదలుపెట్టారు. కానీ సిబిఐని ఆపడం ఎవరి తరమూ కాదు. మంత్రుల మీద సిబిఐ తనంత తానుగా కేసులు పెట్టడం లేదు. జగన్ అక్రమ ఆస్తులకు ఆధారమైన 26 జిఓలతో సంబంధం వున్న వారందరినీ కేసులలో ఎందుకు కలపరాదని సుప్రీం కోర్టు నోటీసులు ఇవ్వడంతో సిబిఐ ఆచర్యకు పూనుకొంటున్నది.

సుప్రీంకోర్టులో రాష్ట్ర ప్రభుత్వం తరఫున ఒక్క అఫిడవిట్ వేస్తే ఈ మంత్రులకు గండం తప్పుతుంది. అయితే గత ప్రభుత్వం జాతి చేసిన 26జిఓలూ సక్రమమని అఫిడవిట్ వేయాలి. అదే జరిగిదే జగన్ మీద పెట్టిన కేసులు తేలిపోతాయి. జిఓలలో తప్పు లేనప్పుడు, వాటి ద్వారా తాను లబ్ది పొందేది ఏమి

కొరవ 14వ పేజీలో

# వివేకా కుట్ర విఫలం

విఆర్ కాలేజి స్థానంలో ఇంజనీరింగ్ కాలేజి ప్రారంభించి, తన మనసుకు నచ్చిన మహిళా నేత ఒకరికి దీర్ఘకాల లీజు ప్రాతిపదికన కానుక ఇవ్వాలని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి చేసిన ప్రయత్నం విఫలమైంది. వైఎంసిఎ చర్చి ప్రాంగణంలో కట్టిన భవంతిని ఇందుకోసం వాడుకోవాలని చూశారాయన. అయితే విఆర్ కాలేజి ఆస్తులు, యాజమాన్యం విషయంలో వున్న వివాదాల దృష్ట్యా దాని యాజమాన్యంలో కొత్త ఇంజనీరింగ్ కాలేజి స్థాపనకు ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ సంస్థ అనుమతి నిరాకరించిందని విశ్వసనీయంగా తెలుస్తున్నది. విఆర్ కాలేజి ఎండోమెంట్ చట్టం క్రింద రిజిష్టర్ అయిన ధార్మిక సంస్థ.

కొరవ 14వ పేజీలో

# దేశ ప్రతిష్ట మసి

ప్రజాస్వామ్యానికి విశ్వాసం మౌలిక పునాది. ప్రభుత్వాల పట్ల, పాలకుల పట్ల ప్రజలకు నమ్మకం వున్నంత కాలమే ప్రజాస్వామిక వ్యవస్థ సాఫీగా ముందుకు సాగుతుంది. దురదృష్టవశాత్తు మనదేశంలో రాజకీయ వాదులు, ప్రభుత్వ పెత్తందారులు ప్రజల విశ్వాసాన్ని పూర్తిగా కోల్పోతున్నారు. రాజకీయ నేత అంటే దొంగ, ప్రభుత్వం అంటే దోపిడీకి నిలయం అనే అభిప్రాయం రోజురోజుకూ బలపడి పోతున్నది. గతంలో ఖద్దరు చొక్కా తొడుక్కొన్నవాడు ఎదురు పడితే ముఖం తెలియనివాడు కూడా గౌరవంగా మసలుకొనే వారు. ఇప్పుడు మంత్రులు, ఎమ్మెల్యేలు రైలులోనో, విమానం లోనో పక్కన కూర్చుంటే సగటు మనిషి ఇబ్బంది పడుతున్నాడు. కుష్టురోగిని తాకినంత కంపరం కల్గుతున్నది రాజకీయవాదుల సంపర్కం.

ప్రధాని మన్మోహన్‌సింగ్ వ్యక్తిగతంగా ఉత్తముడని పేరు. నీతి నిజాయితీలకు నిదర్శనమని ప్రచారం. కానీ ఆయన ప్రధానిగా వున్న ఈ ఎనిమిదేళ్ల కాలంలో భారత ప్రభుత్వ ప్రతిష్ట భ్రష్టుపట్టి పోయింది. ప్రజల ఆస్తులను, ప్రభుత్వ ఖజానాను, జాతీయ వనరులను పందికొక్కుల వలె నమిలి మింగే బందిపోటు దొంగలకు నిలయంగా మారింది ఆయన సర్కారు. ఎన్ని కుంభకోణాలు ఈ స్వల్ప కాలంలో? ఎందరు మంత్రులు జైలుకు వెళ్లారు? కామన్‌వెల్త్ ఆటల పోటీలు, 2జి స్పెక్ట్రం, టట్రా సైనిక ట్రక్కుల కొనుగోలు కుంభ కోణం, మధుకోడా గోల్మాల్, వైఎస్.జగన్ దోపిడీ పరంపర, ఆదర్శ్ కార్గిల్ సైనికుల ఇళ్ల స్వాహా, ఇస్రో దేవాస్ స్పెక్ట్రం స్కాం, కెజి బేసిన్ గ్యాస్ దారుణం, సియాచిన్ సైనికుల రేషన్ స్వాహా... ఇట్లా చెప్పుకొంటూ పోతే మన్మోహన్‌సింగ్ పాలన సమస్తం దోపిడీ మయంగా కన్పిస్తున్నది. తాజాగా బొగ్గు గనుల కేటాయింపు కుంభకోణం వెలికి వచ్చింది. ఈ ఒక్కదాని వల్లనే దాదాపు లక్షా 80 వేల కోట్ల రూపాయల ప్రజాధనం ప్రైవేటు వ్యక్తుల పరమైందని కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ నివేదిక అంచనా వేస్తున్నది.

**జమీన్‌రైతు**

మన దేశంలో బొగ్గు నిల్వలు అపారంగా వున్నాయి. 1970లో ఇందిరా గాంధీ బొగ్గు గనులన్నిటినీ జాతీయం చేసింది. ప్రభుత్వ రంగంలోని కోల్ ఇండియా, సింగరేణి వంటి సంస్థలు మాత్రమే బొగ్గు వెలికి తీసి పరిశ్రమలకు సరఫరా చేయాలని ఆంక్ష పెట్టిందామె. కానీ మన్మోహన్‌సింగ్ వాటిని ప్రైవేటు సంస్థలకు ఇవ్వాలనే విధాన నిర్ణయం తీసుకొన్నాడు. కేవలం ప్రభుత్వ సంస్థలు పరిశ్రమల అవసరాలకు తగిన స్థాయిలో బొగ్గు ఉత్పత్తి చేయలేక పోతున్నాయని, అందువల్ల దేశంలో విద్యుత్, స్టీల్ కొరత అధికంగా వుందని, బొగ్గును ప్రైవేటు వ్యక్తులకు ఇస్తే ఉత్పత్తి పెరిగి విద్యుత్ సమస్య తీరుతుందనే నెపంతో ఈ నిర్ణయం తీసుకొన్నారు. అయితే ఆ కేటాయింపు బహిరంగంగా, పారదర్శకంగా, పోటీ పద్ధతిలో జరిపి వుంటే సమస్య లేదు. కానీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆశ్రయం పొందిన వారికి గాలికి పేలపిండి రామార్పణం అన్నంత ఉదారంగా దాదాపు 142 బొగ్గు గనులు కేటాయించేశారు. ఆ సమయంలో కేంద్రంలో బొగ్గు శాఖకు మంత్రి లేడు. మన్మోహన్‌సింగ్ స్వయంగా ఆ మంత్రిత్వ శాఖను నిర్వహిస్తూ వుండినాడు. అందువల్ల ఈ కేటాయింపు లన్నిటికీ నేరుగా బాధ్యుడు ఆయనే. సీజర్స్ భార్య సందేహాలకు అవకాశం లేని స్థాయిలో వుండాలన్నది, నిజాయితీకి మార్గదర్శక సూత్రం. మన్మోహన్‌సింగ్ నిజాయితీగా వుండడమే కాదు, నిజాయితీగా వున్నట్లు ప్రజలు నమ్మే స్థితి కల్పించుకోవాలి. దురదృష్టవశాత్తు ఆ పరిస్థితి లేదు. ఆయన పరిపాలన వల్ల దేశ ప్రతిష్ట మసై పోయింది. భారత దేశమంటే అవినీతికి నిలయమన్న అభిప్రాయం ప్రపంచమంతా ధృవపడింది. రైలు ప్రమాదం జరిగితే బాధ్యత వహించి, మంత్రిత్వానికి రాజీనామా చేసిన లాల్‌బహదూర్ శాస్త్రి వంటి నేతలు పాలించిన దేశం మనది. కేంద్ర ప్రభుత్వాన్ని అవినీతికి, దోపిడీకి ఆశ్రమంగా మార్చిన అపవాదు తనపై పడిన తర్వాత కూడా ఆ పదవి పట్టుకొని వేలాడడం ద్వారా జాతికి మరింత దారుణమైన అప్రతిష్ట తెస్తున్నాడు మన్మోహన్‌సింగ్. తనపై పడిన మచ్చ నిర్మూలన అయ్యే రీతిలో నిష్పాక్షిక దర్యాప్తు జరిపి నిర్దోషిత్వం నిరూపించుకొనే వరకైనా ఆయన పదవి నుంచి తప్పుకొనే త్యాగం ప్రదర్శించి వుంటే జాతి ప్రజలు సంతోషించి వుండేవారు. తనకు, నీతిమాలిన నేతలకు పదవీ దాహంలో తేడా లేదని ప్రజలు ఛీత్కరించుకొనే ధోరణిలో ప్రవర్తిస్తున్నాడాయన. చాలా బాధాకరమైన ప్రవర్తన ఇది. ఇటువంటి చరిత్రహీనుల వల్ల దేశానికి జరిగే నష్టం అంతా ఇంతా కాదు. ఇప్పటికైనా ఆయన పదవి చూరు పట్టుకొని వేలాడడం మానుకొంటే దేశ గౌరవం నిలుస్తుంది.

## జనవాణి

### అక్కరకు రాని కేంద్రమంత్రులు!

దేశంలోని అన్ని రాష్ట్రాలతో పోలిస్తే ఆంధ్రప్రదేశ్‌లోనే ఎక్కువ మంది కాంగ్రెస్ ఎమ్పీలున్నారు. జైపాల్‌రెడ్డి, పనబాకలక్ష్మి, కిషోర్ చంద్రదేవ్, పురంధేశ్వరి వంటి వారు మంత్రులుగా కొనసాగుతున్నారు. ఎమ్పీలుగానీ, కేంద్ర మంత్రులు గాని రాష్ట్రానికి సాధించిన ప్రత్యేక ప్రాజెక్టులేమీ లేవు. మన రాష్ట్రంలోని గ్యాస్ మహారాష్ట్రలోని రత్నగిరికి తరలించినపుడు తీవ్ర గందరగోళం రేగితే విధిలేక ఆ వ్యవహారాన్ని ప్రధాని పరిష్కరించారు. రైల్వే బడ్జెట్‌లో ప్రతి యేడాది మన రాష్ట్రానికి అన్యాయం జరుగుతూనే వుంది. ప్రక్క రాష్ట్రం తమిళనాడులో పార్టీలకు అతీతంగా పని చేసే ఎమ్పీలు, కేంద్రమంత్రులను చూసి మనవాళ్లు కాస్త మారితే చాలు.

*గద్దం తిరిపాలురెడ్డి* — *మహమ్మదాపురం*

### ఆకాంక్ష నెరవేరేదెన్నడో?

సమాజంలో అందరూ చదువుకొని ఉన్నత శిఖరాలను అధిరోహించాలనే ఆశయంతో ప్రైవేట్ విద్యాసంస్థల్లో పేద విద్యార్థులకు 25 శాతం ఉచితంగా విద్య అందించాలనే సుప్రీంకోర్టు తీర్పు పేదల్లో చిగురిస్తున్న ఆశ. ఈ శుభవార్త ఫలించేదెప్పుడో? వచ్చే యేడాది కన్నా ఫలించేలా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒక నిర్ణయం తీసుకోవాలి.

*డి.శ్యామ్‌సుందర్* — *నెల్లూరు*

### ఈ వివక్షేమిటి?

ఏ మతం వారికైనా ఎటువంటి రాయితీలు ఇవ్వద్దని సుప్రీంకోర్టు స్పష్టంగా కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. అయినా హజ్‌కు వెళ్లే మైనార్టీలకు కేంద్రం విమాన ప్రయాణంలో రాయితీ 15వేల నుంచి 20వేలకు ఇటీవల పెంచింది. అంతేకాదు ఇంకొద్దిగా ముందుకు వెళ్లి వారి సంఖ్యను పెంచింది. ఏ మతం వారైనా తమ స్వంత ఖర్చులతో పుణ్యస్థలాలకు వెళ్లాలి. ఇది అన్ని మతాల్లో వుంది. ఎవరో సహాయం చేస్తే వెళ్లడం మంచిదికాదు. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు జెరుసలెం వెళ్లడానికి క్రైస్తవులకు ప్రభుత్వ ఖజానా నుండి సహాయం చేస్తున్నాయి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదాయం అత్యధికులైన హిందువుల నుంచి వస్తున్నది. మరి దీన్ని గమనించాలి.

*పి. ప్రభావతి* — *నెల్లూరు*

### రైళ్లలో మరుగుదొడ్ల ఘోరం!

రైళ్లలో టాయిలెట్లు శుభ్రపరచడంలో రైల్వేశాఖ అధమస్థాయిలో వుంది. జనరల్ బోగీల నుండి ఫస్ట్ ఏసి కోచ్‌ల వరకు రైలు ప్రయాణం ప్రారంభం అయిన గంట తర్వాత టాయిలెట్ల స్థితి చూస్తే వాంతులు, వికారం కలుగు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**24-8-1942**
**పేజీలు : 8 వెల: అణా**

### మనము – మన పత్రికలు!

గుర్రాల నోటికి కళ్లాలు తగిలించి రస్తాలో సవారి చేస్తారు యజమానులు. ఖైదీల చేతులకు సంకెళ్లు వేసి బంధిస్తారు.

గాంధీ పుణ్యమా అంటూ మనకు అవీ, ఇవీ కూడా లభ్యమైనవి. ఈ ముసలివాడు చేసేది ఒక్కొక్క పనా?

గాంధీ మీద కోపంతో ప్రభుత్వం పత్రికల మీదకు దూకుతున్నది. యిట్లయితే యికమేం నిభాయించ లేమురో బాబూ అని దేశవాళీ పత్రికలు ఒకటి వెంబడి ఒకటి కార్యాలయాలు బంద్ చేసినవి. ఎంతెంత అవస్థ వచ్చి పడ్డదండీ దేశానికి? వస్తే ఏం? నిన్ను జూచి జాలి పడేదెవరు. ఈ దిక్కుమాలిన దేశంలో.

### నెల్లూరులో 7 పత్రికలు నిలిచిపోయినవి

21–8–42 తేది సాయంత్రం 6 గంటలకు నెల్లూరు పత్రికాధిపతులు 'జమీన్‌రైతు' కార్యాలయమున ఆంధ్రప్రజ ఎడిటర్ డాక్టర్ ఎం.ఎస్.మూర్తి గారి అధ్యక్షత క్రింద సమావేశమై ఈ క్రింది తీర్మానమును చేసిరి.

పత్రికలపై ప్రభుత్వం వారు విధించిన ఉత్తర్వులు చాలా కఠినముగా నున్నవనియు, వార్తా ప్రచురణమే దుస్సాధ్యమగుచున్నదనియు, పత్రికా గౌరవమునకు భంగకరమనియు, ఇందుచే ప్రజా సముదాయమునకు సరియగు సేవచేయలేని పరిస్థితులు యేర్పడినందునను ఈ సమావేశం వారు తమ అసమ్మతిని తెలుపుచూ, అనుకూల పరిస్థితులు యేర్పడునంత వరకూ అసమ్మతి సూచకముగా నెల్లూరు నుండి వెలువడు ఆంధ్రప్రజ, జమీన్‌రైతు, కేసరి, సింహపురి, ప్రజాసేవ, దక్కన్ వైశ్య, సుబోధిని పత్రికలను 24–8–42 తేదీ నుంచి నిలుప వలసిందిగా తీర్మానించడమైనది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**24-8-1962**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరును చీకటిమయం చేస్తారా?

నెల్లూరు థర్మల్ స్టేషన్‌లోని రెండవ యంత్రాన్ని గూడా హైదరాబాద్‌కు తరలించి వేస్తామని, అందువల్ల హైదరాబాదులో విద్యుత్‌చ్ఛక్తి కొరత తీరగలదని ప్రభుత్వ ప్రతినిధి ఒకరు చెప్పినట్లు పత్రికలలో వెలువడిన వార్త నెల్లూరీయులకు దిగ్భ్రాంతి కలిగిస్తున్నది. ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా నెల్లూరు అవసరాలు త్రోసివేయబడి గతంలో ఒక యంత్రం తెలంగాణకు తరలింపబడింది. ఇప్పుడు ఈ రెండవది గూడా పోతే; విద్యుచ్ఛక్తి మంత్రిగారి స్వస్థానమైన నెల్లూరు విద్యుత్ కొరతతో దుస్థితి పాలవుతుంది.

అటు మచ్‌ఖండ్ విద్యుత్తుగానీ, ఇటు తుంగభద్ర విద్యుత్తుగానీ నెల్లూరుకు వచ్చే లోపల శక్తిహీనమై, కొన్ని సమయాలలో విఫలమై పోతున్నది. అటువంటి అవసర సమయాల్లో ప్రస్తుతం థర్మల్ స్టేషన్‌లో ఉన్న ఆ ఒక్క యంత్రం ఆదుకొంటున్నది. అదీ లేకుంటే నెల్లూరు 'బ్లాక్ అవుట్' కావలసిందే. నెల్లూరు అవసరాలను త్రోసివేసి, యింకెవరి సౌకర్యానికో ఉద్దేశింపబడినది యదార్థమైతే ప్రజలు, ప్రజాప్రతినిధులు తీవ్రంగా ప్రతిఘటించక తప్పదు. విద్యుత్ శాఖా మంత్రి ఏ.సి.సుబ్బారెడ్డి గారు నెల్లూరుకు ఈ అన్యాయం జరగనివ్వరని పూర్తిగా విశ్వసిస్తున్నాము.

### కనకమ్మకు గోపాలరెడ్డి పరామర్శ

బెజవాడ గోపాలరెడ్డి 17వ తేది సతీసమేతంగా, అనారోగ్యంతో పడకపై ఉన్న శ్రీమతి పొణకా కనకమ్మ గారిని చూసి ఒక అర గంట సేపు వారితో ఇష్టాగోష్ఠిగా గడిపి; సేవాత్యాగాలతో పండిన ఆ ఉత్తమ దేశభక్తురాలిని రూ.116తో సత్కరించారు. తన 55వ జన్మదినోత్సవ చిహ్నంగా మరొక 55 రూపాయల కవరును ఆమెకు అందించారు.

# నెల్లూరు ముచ్చట్లు

## టౌన్‌హాల్ కమిటీ కార్యదర్శిగా జెఎస్‌రెడ్డి!

నెల్లూరు టౌన్‌హాల్ నిర్వాహక కమిటీ కార్యదర్శిగా వదాన్యుడు జెఎస్‌రెడ్డిని కమిటీ కార్యవర్గం ఇటీవల ఏకగ్రీవంగా ఎన్నుకొంది. టౌన్‌హాల్ నిర్వాహక కమిటీలో సభ్యులుగా మునిసిపల్ కార్పొరేషన్ తరపున ఎ.వి.కృష్ణారెడ్డి, విఆర్ కాలేజి కమిటీ తరపున నాగారెడ్డి శ్రీనివాసులురెడ్డి, వర్ధమాన సమాజం తరపున పొన్నాల రామసుబ్బారెడ్డి, రేబాల లక్ష్మీనరసారెడ్డి కుటుంబ పక్షాన రేబాల హరిశ్చంద్రారెడ్డి, కో ఆప్షన్ సభ్యునిగా జె.ఎస్.రెడ్డి కొనసాగుతున్నారు. ఐదుగురు సభ్యులు సమావేశమై జెఎస్‌రెడ్డిని కొత్త కమిటీ కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

జెఎస్‌రెడ్డి వదాన్యత వల్ల టౌన్‌హాలుకు కొత్త రూపు, హంగులేర్పడ్డాయి. సౌండ్ సిస్టం మాత్రం ముతకగానే ఉంది. దాన్ని మారిస్తే టౌన్‌హాల్‌లో ఎటువంటి కార్యక్రమాన్ని అయినా బ్రహ్మాండంగా చేసుకోవచ్చు.

## దోచేసిన కోళ్ల వ్యాపారులు

ఒకే ఒక్క రోజు లక్షాధికారులవ్వడం లాటరీ తగిలితేనో, నిధినిక్షేపాలు దొరికితేనోగానీ సాధ్యం కాదు. కానీ నెల్లూరులోని కోడి మాంసం అమ్మేవారు మాత్రం 19, 20 తేదీల్లో రంజాన్ పండుగను పురస్కరించుకొని ఒక్కసారిగా కిలో కోడి మాంసం 120 రూపాయల నుంచి 168 రూపాయలకు పెంచేశారు. రాష్ట్రంలో ఎక్కడా ఇంత రేటు లేదు. మరో ప్రత్యామ్నాయం లేకపోవడంతో జిల్లాలో పది లక్షలకు పైగా కోళ్ల మాంసం కొన్న వినియోగదారులు వందలాది రూపాయలు నష్టపోగా, విక్రేతలు మాత్రం లక్షలాది రూపాయలు లాభం పొందారు. 50వేలకు పైగా పొట్టేళ్లు రంజాన్ సందర్భంగా తెగినా దాని మాంసం 400 రూపాయలకు కొనను జనం కుయ్యోమొర్రోమన్నారు.

## కిలో బిర్యానీ @ 800 రూపాయలు!

పాత రోజుల్లో ఏ మతస్థుల పండగలైనా ఇళ్లలో వంటావార్పులు చేసేవారు. రోజులు మారాయి. బయట ఆర్డర్ ఇచ్చి చేయించుకొని చేతులు కడిగేస్తున్నారు. రేట్లు, డిమాండ్ అంటూ క్యాటరింగ్ సర్వీసులు, వంటగాళ్లు సైతం రంజాన్‌ను పురస్కరించుకొని కిలో మటన్ బిర్యానీకి 800 రూపాయలు, చికెన్ బిర్యానీకి 400 రూపాయలుగా ఛార్జ్ చేశారు. వంకాయ కూర, పెరుగు పచ్చడి మాత్రం ఉచితంగా ఇస్తున్నట్లు చెప్పుకొచ్చారు. మొత్తంమీద ఈ యేడాది రంజాన్‌కు ఇళ్లలో బిర్యానీ బదులు వీధుల్లో బిర్యానీనే హిందూ – ముస్లిం సోదరులు తినాల్సి వచ్చింది.

## వంటేరు దూరం

తెలుగుదేశం పార్టీలో సీనియర్ నేత, కావలి ఎమ్మెల్యేగా ఒకసారి గెలిచి, నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి రెండుసార్లు ఓడిన వంటేరు వేణుగోపాల్‌రెడ్డికి ఆ పార్టీపై ముఖం మొత్తినట్లుంది. పార్టీకి దూరమై పోతున్నట్లు హైదరాబాద్‌లో ప్రకటించారాయన. వ్యాపారవేత్తగా చంద్రబాబుకు దగ్గరైన వేణుగోపాల్‌రెడ్డిని ఆయన ఎంతగానో అభిమానించేవాడు. వెళ్తూ వెళ్తూ వంటేరు వేణుగోపాల్‌రెడ్డి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి వైకిరికి విసిగి వెళ్తున్నట్లు ప్రకటించడం ఆయన స్థాయికి సబబు కాదేమో? మొత్తం మీద వంటేరును 21వ తేదీన హైదరాబాద్‌కు పిలిపించి చంద్రబాబు సముదాయించడంతో రాజీనామాకు వంటేరు కొన్నాళ్లు వాయిదా వేసినట్లు చెప్పాలి.

## కోల్డ్‌వార్!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, వైకాపా జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిల మధ్య కోల్డ్‌వార్ జరుగుతుంది. గోవర్ధన్‌రెడ్డిని తీవ్ర స్వరంతో వివేకానందరెడ్డి నిందిస్తుండంతో ఆయన వాటికి సమాధానం చెప్పుకోలేక ఇబ్బంది పడుతున్నాడు. ఏ ఇద్దరు కలసి ఉన్నా చూడలేక వారి మధ్య చిచ్చుపెట్టే సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికన్నా కాకాణి గోవర్ధన్‌రెడ్డి వంద రెట్లు ప్రమాదకరమైన వ్యక్తి అని వివేకా విమర్శించాడు. నిక్కరుతో హైదరాబాద్ వెళ్లి ఆయన కోట్లు గడించాడని, మేకపాటి సోదరులు కూడా కాకాణి చేసే కిరికిరీలు గ్రహించారని చెప్పుకొచ్చారు. తమ దయాదాక్షిణ్యంతో జడ్పీ ఛైర్మన్ అయి తమను విమర్శించడం దారుణమన్నారు.

వీటికి సమాధానంగా కాకాణి గోవర్ధన్‌రెడ్డి తన తండ్రి రమణారెడ్డి ఎప్పటి నుంచో రాజకీయాల్లో ఉన్నాడని, అప్పటికి బ్రదర్స్ రాజకీయ రంగ ప్రవేశం కూడా చేయలేదని ఘాటు జవాబిచ్చారు. తాను జడ్పీ నిధులు పైసా దుర్వినియోగం చేశానని నిరూపించినా శాశ్వతంగా ప్రజా జీవితం నుంచి వైదొలుగుతానని ప్రకటించాడు. మొత్తానికి ఈ మాటల యుద్ధం ఎప్పటికి ఆగుతుందో?

## రాజీవ్ విద్యామిషన్‌కు కొత్త పిడి!

రాజీవ్ విద్యామిషన్ కొత్త ప్రాజెక్ట్ డైరక్టర్‌గా వ్యవసాయ శాస్త్రవేత్త కోదండరామిరెడ్డిని డిప్యుటేషన్‌పై నియమించారు. ఈయన ఎన్ని రోజులపాటు ఈ పదవిలో ఉంటారో వేచి చూడాలి. విద్యాశాఖలో అధికారులు లేకనా ఇతర శాఖల నుంచి ఆర్వీఎం అధికారులను నియమించడం. దీనివల్లే ఈ మిషన్ నడత గబ్బు రేపుతుంది.

## పిట్టి ఉచిత వైద్యం

నెల్లూరు గాంధీనగర్‌లో పేరుగాంచిన ఊపిరితిత్తుల వ్యాధినిపుణుడు డాక్టర్ పిట్టి మల్లికార్జునరావు, డాక్టర్ భారతి దంపతులు తమ క్లినిక్ 21వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 19వ తేది ఉచిత వైద్యం చేశారు. ఈ శిబిరాన్ని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ప్రారంభించారు. శిబిరానికి వచ్చిన 1500 మందికి మందులు, ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ స్కానింగ్, రక్తపరీక్షలు ఉచితంగా చేశారు.

## హాస్టల్ విద్యార్థులకు వంట సామాగ్రి పంపిణీ!

లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు పినాకిని ఆధ్వర్యంలో భక్తవత్సలనగర్‌లోని జివిఆర్ కాలేజి హాస్టల్‌లోని విద్యార్థులకు వంట సామాగ్రి పంపిణీ చేశారు. ఈ సందర్భంగా క్లబ్ అధ్యక్షులు చెవుల యుగంధర్ మాట్లాడుతూ విద్యార్థులందరూ బాగా చదువుకొని భవిష్యత్తులో మంచి పురోగతి సాధించాలని, వచ్చే ఏడాది నుంచి మెరిట్ విద్యార్థులకు తమ క్లబ్ తరపున స్కాలర్‌షిప్పులిస్తామన్నారు. ఈ కార్యక్రమంలో ఆర్కాటు శ్రీనివాసులు, టి.వెంకటేశ్వర్లు, బయ్యా రవి, మురళి, చంద్రశేఖర్, తులసి చంద్రశేఖర్, కాలేజి ప్రిన్సిపల్ వెంకటేశ్వర్లు, వైస్ ప్రిన్సిపల్ గు౹౹రం సుధాకర్ తదితరులు పాల్గొన్నారు.

## శ్రీధర్‌రెడ్డి వినూత్న నిరసన!

ప్రభుత్వ వైద్యశాలల్లో రోగులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలని కోరుతూ వైకాపా నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి నెల్లూరు పెద్దాసుపత్రిలో వినూత్న నిరసన చేపట్టారు. హాస్పిటల్ సూపరింటెండెంట్ కుర్చీకి శాలువా కప్పి, పూల మాలలు వేసి, బొకే, స్వీట్స్ ఇచ్చి ఘన సన్మానం చేశారు. అనంతరం ఆయన మాట్లాడుతూ దోమ, కుక్క, పాముకాటుకు సైతం ప్రభుత్వాసుపత్రిలో మందులు లేవన్నారు. పూర్తిస్థాయిలో డాక్టర్లు, సిబ్బంది కూడా లేరని, పసిపిల్లల ప్రాణ రక్షణ కోసం తీసుకొంటున్న జాగ్రత్తలేమిటో వివరించాలని డిమాండ్ చేశారు. అత్యవసర మందుల కొనుగోళ్లకు 60 లక్షల రూపాయల నిధులున్నా కొనుగోలు చేయకపోవడానికి కారణమేమిటో చెప్పాలని నిలదీశారు. శ్రీధర్‌రెడ్డి ప్రశ్నలకు హాస్పిటల్ సూపరింటెండెంట్ వద్ద సమాధానం లేదు. ఈ కార్యక్రమంలో కెవి రాఘవరెడ్డి, పిగిలం సురేష్, తాటి వెంకటేశ్వర్లు, పాండురంగారెడ్డి, బి.శ్రీకాంత్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## రాజీవ్ గాంధీ జయంతి

మాజీ ప్రధాని స్వర్గీయ రాజీవ్‌గాంధీ 68వ

కొరవ 14వ పేజీలో

# ఇసుక మాఫియా పని పట్టండి!

## కలెక్టర్, ఎస్పీ హుకుం

సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

ఇసుక అక్రమ తరలింపును అరికట్టడంలో భూగర్భ గనుల శాఖ అధికారులు బాధ్యతారహితంగా, నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని జిల్లా ఉన్నతాధికారులైన కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, ఎస్పీ రమణకుమార్ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. జిల్లాలోని నదీ పరీవాహక ప్రాంతాల్లో యదేచ్ఛగా ఇసుకను త్రవ్వి తమిళనాడుకు తరలించుకుపోతున్నా ఏం చేస్తున్నారని వారు ప్రశ్నించారు. ఇసుక త్రవ్వకాలను అరికట్టే విషయమై వివిధ శాఖల అధికారులతో ఆగష్టు 17న జడ్పీ హాలులో సమావేశం నిర్వహించారు. సమావేశం ప్రారంభమైనప్పటి నుంచి కలెక్టర్ అధికారుల తీరుపై ఆగ్రహం వ్యక్తం చేయగా ఎస్పీ సైతం తనదైనశైలిలో అధికారుల తీరును తూర్పారబట్టారు. కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ ఇసుకను అక్రమంగా త్రవ్వి రాష్ట్ర సరిహద్దులు దాటిస్తున్నా సంబంధిత అధికారులు నిద్రపోతున్నారా అని ప్రశ్నించారు. భూగర్భ గనుల శాఖ ఎడిని ప్రశ్నల వర్షం కురిపించగా ఆయన దేనికీ సమాధానం చెప్పలేక నీళ్లు నమలడంతో కలెక్టర్‌కు చిర్రెత్తుక వచ్చింది. ఏం తమాషాలు చేస్తున్నారా? ఎక్కడికక్కడ ఇసుకను తరలిస్తున్నా ఎందుకు పట్టించుకోవడం లేదని ప్రశ్నించారు. అడిగిన దానికి సరైన సమాధానం ఇవ్వని ఎడిపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసిన కలెక్టర్ చీఫ్ సెక్రటరీ సైతం ఇసుక మాఫియాను అరికట్టలేకపోవడంపై ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారని తెలిపారు. మీరు చేసే తప్పులకు మేము మాటలు పడాల్సి వస్తోందని, ఉన్నతాధికారులు మొత్తం అడ్మినిస్ట్రేషన్‌పైనే అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారని తెలిపారు. మేము ఎన్నిసార్లు హెచ్చరించినా మార్పు రావడం లేదన్నారు. గ్రామాల్లో విఆర్‌ఓలకు తెలియకుండా ఏదీ జరగదని, ఇసుక మాఫియా నిజంగానే పెద్ద మాఫియా అని, ఇందులో అనేక మంది పాత్ర ఉందన్నారు. టైరు బండ్లలో సైతం ఇసుకను తీసుకొనిపోయి ఎవరికి అనుమానం రాకుండా ఒక చోట చేర్చుతూ అక్కడి నుంచి తరలిస్తున్నారన్నారు. ఇకపై టైరు బండిలో వెళ్లే ఇసుకపై కూడా నిఘా పెట్టాలన్నారు. ప్రతి ఒక్కరూ తమిళనాడు సరిహద్దులోని రామాపురానికి తీసుకెళ్తున్నట్లు చెప్తున్నారని, నిజానికి అది చాలా చిన్న గ్రామం అని అంతమేర ఇసుక అవసరం లేదన్నారు. ఆ సాకుతో తమిళనాడుకు తరలిస్తున్నారని తెలిపారు. కఠినంగా వ్యవహరించి ఇసుక మాఫియాను అడ్డుకోమని ఆదేశించారు. ఎస్పీ రమణకుమార్ మాట్లాడుతూ తమ సిబ్బందిని పంపుతామని చెప్తున్నా భూగర్భ గనుల శాఖ నుంచి స్పందన ఉండడం లేదన్నారు. ఆ శాఖ ఎడిని ఉద్దేశించి మేము అనేకసార్లు ఫోన్‌చేసి రమ్మని చెప్పినా మీరు రాలేదంటూ మండిపడ్డారు. అన్ని శాఖల దగ్గర్నుంచి జిల్లాస్థాయి అధికారుల వరకు ప్రతిఒక్కరూ బాధ్యత వహించి ఇసుక మాఫియాకు అడ్డుకట్ట వేయాలని అధికారులకు ఆదేశాలు జారీ చేశారు. ఇరువురు ఉన్నతాధికారులు స్పష్టమైన ఆదేశాలు జారీచేసిన నేపథ్యంలో ఎంతమేర సత్ఫలితాలను ఇస్తాయో చూడాలి.

# ముస్లిం మహిళలు ముందడుగు వేయాలి!

## ● బ్రహ్మాండంగా జరిగిన పొదుపు సంఘాల నమోదు సభ

ప్రభుత్వ సంక్షేమ పథకాలను నిరుపేద ముస్లింలు సద్వినియోగం చేసుకొని ఆర్థిక ప్రగతి సాధించాలని టు సర్కిల్ డాట్ నెట్(టిసిఎన్) డైరక్టర్ ఇర్ఫాన్ ఆకాంక్షించారు. హాజీ అబ్దుల్ అజీజ్ చారిటబుల్ ట్రస్ట్, సెంటర్ ఫర్ సోషల్ జస్టిస్ (హైదరాబాద్) ఆధ్వర్యంలో ప్రభుత్వ సహకారంతో సర్వోదయ కళాశాల ప్రాంగణంలో ముస్లిం మహిళల స్వయం సహాయక పొదుపు సంఘాల నమోదు సభ నిర్వహించారు. ఈ సభలో ఆయన మాట్లాడుతూ దారిద్ర్యరేఖకు దిగువున ఉన్న ముస్లిం మహిళల అభివృద్ధిని కాంక్షించి చేపట్టిన కార్యక్రమమని ప్రశంసించారు. సెంటర్ ఫర్ సోషల్ జస్టిస్ డైరక్టర్ ఆరిఫ్ అహ్మద్ మాట్లాడుతూ జిల్లాలోని ప్రతి నిరుపేద ముస్లిం కుటుంబం పొదుపు సంఘాల్లో చేరాలని కోరారు. హాజీ అబ్దుల్ అజీజ్ ట్రస్ట్ ఛైర్మన్ అజీజ్ మాట్లాడుతూ ఎలాంటి లాభాపేక్ష లేకుండా ఈ పొదుపు కార్యక్రమాన్ని ప్రత్యేకంగా చేపట్టామన్నారు. మైనార్టీ మహిళల్లో చైతన్యం తెచ్చేందుకు తమ వంతు సామాజిక బాధ్యతగా 600 గ్రూపులతో పొదుపు సంఘాల నమోదుకు ప్రత్యేక ప్రణాళికతో శ్రీకారం చుట్టామన్నారు. ఈ సదస్సుకు పెద్ద సంఖ్యలో ముస్లిం మహిళలు హాజరయ్యారు. ప్రభుత్వ అధికారులు ఈ సదస్సుకు హాజరు కాకపోవడం విమర్శకు దారి తీసింది.



సదస్సులో మాట్లాడుతున్న అబ్దుల్ అజీజ్.

# ఐటిడిఏ పిఓకు సిఎం ప్రశంస!


నెల్లూరు ఐటిడిఏ పిఓ వై.వెంకటేశ్వర్లుకు ప్రశంసాపత్రాన్ని అందజేస్తున్న ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి.

జిల్లాలో జరిగిన విద్యార్థుల ప్రగతి కోసం ప్రభుత్వం చేపట్టిన 'పునాది' కార్యక్రమాన్ని విజయవంతం చేసినందుకు సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ(ఐటిడిఏ) నెల్లూరు ప్రాజెక్ట్ ఆఫీసర్ వై.వెంకటేశ్వర్లుకు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రశంసాపత్రాన్ని అందజేశారు. ఆగష్టు 16వ తేది హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో ముఖ్యమంత్రి వెంకటేశ్వర్లును అభినందించారు. గిరిజన పిల్లలు విద్యకు దగ్గరయ్యేందుకు ప్రభుత్వం చేపడుతున్న క్వాలిటీ ఎడ్యుకేషన్ ఫర్ షెడ్యూల్డ్ ట్రైబ్ (క్వెస్ట్) కార్యక్రమాన్ని కూడా విజయవంతం చేయమన్నారు.

## ● గోదాముల్లో అక్రమ

# బియ్యం నిల్వలు!

## ● రైస్ మిల్లర్లా... మజాకానా?

జిల్లాలోని వివిధ ప్రైవేటు గోదాముల్లో అక్రమంగా బియ్యం నిల్వ చేస్తున్నారు. మార్కెట్‌లో బియ్యం కృత్రిమ కొరత సృష్టించి అధిక ధరలకు విక్రయించాలన్న ఉద్దేశ్యంతో రైస్ మిల్లర్లు వ్యాపారులు కొందరు రహస్యంగా గోదాములను ఏర్పాటు చేసుకొని బియ్యాన్ని నిల్వ చేస్తున్నట్లు తెలుస్తుంది. పౌరసరఫరాల శాఖకు ప్రతి సంవత్సరం రైస్ మిల్లర్లు బియ్యం సరఫరా చేయాల్సి ఉంటుంది. తక్కువ ధరకు బియ్యం సరఫరా చేయాల్సి రావడం వల్ల రైస్‌మిల్లర్లు నిర్ణయించిన విధంగా సరఫరా చేయడం లేదు. ఇదే బియ్యాన్ని తమిళనాడు రాష్ట్రానికి తరలించి అధిక ధరకు విక్రయిస్తుంటారు. ఇలా తమిళనాడుకు రవాణా చేస్తున్న బియ్యాన్ని విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు పట్టుకోవడం జరిగింది. ఇంత జరుగుతున్నా అధికారుల్లో మాత్రం స్పందన కానరాకపోవడం విశేషం. రేషన్ షాపులకు సరఫరా చేస్తున్న సబ్సిడీ బియ్యం సైతం తమిళనాడుకు తరలిస్తున్నారు. ఇటీవల టన్నుల కొద్దీ బియ్యం స్వాధీనం చేసుకుంటున్న ఒక డీలర్‌ను గుర్తించినా చర్యలు తీసుకోలేక పోతున్నారు. ప్రభుత్వ గోదాముల్లో బియ్యం నిల్వలు తగ్గుముఖం పట్టకముందే అధికారులు స్పందించాల్సిన అవసరం ఉంది.

## ● స్కూళ్లకే

# మధ్యాహ్న భోజన బియ్యం!

## ● సరికొత్త నిర్ణయం

ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనానికి సంబంధించిన బియ్యం ఇక నుంచి నేరుగా ఆయా పాఠశాలలకే సరఫరా చేయనున్నారు. ఇప్పటివరకు రేషన్ షాపు డీలర్ల ద్వారా బియ్యం అందించేవారు. ఈ విధానం కారణంగా నిర్ణీత సమయానికి ఏజెన్సీ నిర్వాహకులకు బియ్యం సరఫరా కాకపోవడం వల్ల ఇబ్బంది పడేవారు. డీలర్లు స్టాక్ పాయింట్ల నుంచి బియ్యం తీసుకురావడం ఆలస్యం చేస్తుండడంతో విద్యార్థులకు భోజనం తయారు చేయలేక పోయేవారు. దీంతో ఉత్తుత్తి మధ్యాహ్న భోజన పథం అన్న విమర్శలు కూడా రేగాయి. గ్రామీణ ప్రాంతాల్లో మధ్యాహ్న భోజనం లేకపోవడం వల్ల స్కూళ్లలో విద్యార్థుల హాజరు కూడా తగ్గింది. ఈ విషయాన్ని ఆయా పాఠశాలల ప్రధానోపాధ్యాయులు అధికారులకు విన్నవించడంతో డిఇఓ ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్లడం జరిగింది. దీంతో స్పందించిన ప్రభుత్వం రేషన్ షాపులకు బదులు నేరుగా ఆయా పాఠశాలలకే బియ్యం సరఫరా చేయాలని ఉత్తర్వులు జారీ చేసింది. మండల విద్యాశాఖాధికారుల నుంచి పాఠశాలలకు ఎంత బియ్యం సరఫరా చేయాలన్న వివరాలు తెప్పించుకుంటున్నారు. జిల్లా పౌరసరఫరాల శాఖ ఆధ్వర్యంలో పాఠశాలలకు బియ్యం సరఫరా చేస్తారు. ఎక్కువ రోజులు బియ్యం నిల్వచేస్తే చెడిపోయే అవకాశం ఉండడంతో వారానికోసారి సరఫరా చేయాలని నిర్ణయించారు. మొత్తం మీద ప్రయోగాత్మకంగా చేపడుతున్న ఈ పథకం విజయవంతం కావాలని కోరుకొందాం.

# చెరకు రైతులకు బకాయిలు చెల్లించాలి!

## సోమిరెడ్డి డిమాండ్



జిల్లాలో వున్న మూడు షుగర్ ఫ్యాక్టరీలకు చెందిన రైతులకు బకాయిపడ్డ 41 కోట్ల రూపాయలను తక్షణం చెల్లించాలని తెలుగుదేశంపార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి డిమాండ్ చేశారు. అసలే అంతంతమాత్రంగా వున్న చెరకు రైతులకు ఫ్యాక్టరీలు నెలల తరబడి బకాయిలు చెల్లించకపోవడంతో వారి పరిస్థితి ఇబ్బందికరంగా మారిందన్నారు. జిల్లా తెలుగుదేశం పార్టీ కార్యాలయం ఎన్‌టిఆర్ భవన్‌లో చెరకు రైతుల బకాయిలపై ఆయన విలేకరుల సమావేశం నిర్వహించారు. కోవూరు, నాయుడుపేట, పొదలకూరులో గల షుగర్ ఫ్యాక్టరీలు ఇప్పటివరకు చెరకు రైతులకు బకాయిలు చెల్లించలేదన్నారు. ఎన్నో వ్యయ ప్రయాసలకు ఓర్చి చెరకు సాగుచేస్తున్న రైతులు బకాయిల వలన తీవ్రంగా నష్టపోతున్నారన్నారు. దీనిపై ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి దృష్టికి తీసుక వెళ్లగా వెంటనే పరిష్కరిస్తామనని హామీ ఇచ్చి తర్వాత పట్టించుకోలేదని విమర్శించారు. దీంతో రైతుల పట్ల మంత్రి వైఖరి ఏమిటో అర్థమవుతున్నదన్నారు. ప్రభుత్వ విధానంతో చెరకు సాగుచేసిన రైతులు అప్పుల పాలవుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ఫలితంగా జిల్లాలో చెరకు సాగు విస్తీర్ణం తగ్గిందన్నారు. చెరకు బకాయిలపై ఆ శాఖ కమిషనర్‌కు ఫిర్యాదు చేశామన్నారు. తక్షణం బకాయిలను చెల్లించాలని, రైతులకు బకాయిలు వున్న షుగర్ ఫ్యాక్టరీ లైసెన్సును రద్దు చేయాలని డిమాండ్ చేశారు. ఈ సమావేశంలో తెలుగుయువత రాష్ట్ర అధ్యక్షుడు బీద రవిచంద్ర, బెజవాడ ఓబుల్‌రెడ్డి, గోవర్ధన్‌రెడ్డి, వెంకటేశ్వర్లురెడ్డి, మల్లిఖార్జున్ తదితరులు పాల్గొన్నారు.

# దర్గా స్థలంలో వైకాపా జెండా!

## విశ్వనాధరావుపేటలో ముస్లిం మహిళల నిరసన

దర్గా స్థలం ఆక్రమించి వైఎస్ఆర్ పార్టీ జెండా ఆవిష్కరణ చేయాలని యత్నించడం విశ్వనాధరావుపేట పంచాయితీ పరిధిలో ఉద్రిక్తతకు దారి తీసింది. ఇక్కడి కొత్తూరు గ్రామంలో గల దర్గా ఆవరణను తమ రాజకీయాలకు వాడుకోవాలని చూసిన వారిని ముస్లింలు అడ్డుకొన్నారు. ఇక్కడ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జెండాను ఏర్పాటు చేసేందుకు ఆ పార్టీ నేతలు ప్రయత్నించడంతో వివాదం నెలకొనింది. దీంతో కోపోద్రిక్తులైన ముస్లిం మహిళలు దీనిని నిరసిస్తూ పోలీస్ స్టేషన్‌కు ఫిర్యాదు చేసేందుకు వెళ్లగా అక్కడి ఎస్ఐ తహశీల్దార్‌తో మాట్లాడమని ఉచిత సలహా పారేసి చేతులు దులుపుకొన్నాడు. గ్రామస్తులు ఎమ్మార్వో దగ్గరకు వెళ్తే ఆయన ఈ విషయాన్ని వైఎస్ఆర్ పార్టీ నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డికి చెప్పండని సలహా ఇచ్చి జారుకోవడం పట్ల గ్రామస్తులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. చివరకు దీనిని ఆ పార్టీ నేతలు చిలకపాటి వెంకటేశ్వర్లు, తూపిలి పెంచలయ్యకు తెలిపారు. వారు ప్రతాప్‌కుమార్‌రెడ్డికి చెప్పడంతో స్పందించిన ఆయన స్వయంగా అక్కడకు వచ్చి ముస్లింలతో మాట్లాడారు. దర్గా స్థలంలో పార్టీ జెండా కట్టడం తప్పేనని అంగీకరించిన ఆయన వాటిని తొలగిస్తామని చెప్పాడు. ముస్లింలు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరిస్తానని హామీ ఇవ్వడంతో వివాదం సద్దుమణిగింది. అయితే బాధ్యతాయుతమైన ఎస్ఐ, తహశీల్దార్‌లు ఈ సమస్యను పట్టించుకోకుండాపోవడం విమర్శల పాలయ్యింది.

# కోటంరెడ్డి పాదయాత్ర మళ్లీ మొదలు!

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో నిలిచిపోయిన పాదయాత్రను ఈ నెల 31 నుంచి తిరిగి ప్రారంభిస్తున్నారు. వైకాపా నేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి 141 రోజుల పాదయాత్రలో భాగంగా ఇప్పటికి 100రోజులు పూర్తి చేయడం జరిగింది. నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గాల ఉప ఎన్నికల కారణంగా పాదయాత్రకు తాత్కాలికంగా బ్రేకు పడింది. మళ్లీ ఈ యాత్రను ప్రారంభిస్తున్నట్లు ఎంవీఎస్ కళ్యాణ మండపంలో జరిగిన వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల సమావేశంలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ప్రకటించారు. తాను చేపట్టిన మహాపాదయాత్ర కార్యక్రమాన్ని పూర్తి చేస్తానని ఆయన ప్రకటించారు. రూరల్ నియోజకవర్గం పరిధిలోకి వచ్చే మునిసిపల్ డివిజన్లలో పాదయాత్ర వుంటుందన్నారు. పాదయాత్ర సమయంలో ప్రతి ఇంటికి వెళ్లి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాల గురించి వివరించనున్నట్లు తెలిపారు.

అలాగే వైఎస్ మరణానంతరం ప్రస్తుత ప్రభుత్వం వ్యవహరిస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను ప్రజలకు తెలియజేయనున్నట్లు చెప్పారు. ఆరోగ్యశ్రీ పథకం ద్వారా పేదలకు కార్పొరేట్ ఆసుపత్రుల్లో ఉచితంగా వైద్య సేవలు అందించారన్నారు. ఆయన రెక్కల కష్టంతో వచ్చిన అధికారాన్ని అనుభవిస్తున్న ప్రస్తుత పాలకులు పథకాలకు తూట్లు పొడుస్తున్నారని ఆరోపించారు. ఫీజు రీఎంబర్స్‌మెంటు పథకానికి ప్రభుత్వం అనేక కొర్రీలు వేస్తూ విద్యార్థుల చదువులకు ఆటంకం కలిగిస్తుందని విమర్శించారు. రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులను ప్రజలు గమనిస్తూ ప్రభుత్వాన్ని దింపేందుకు సిద్ధంగా వున్నారని గుర్తు చేశారు. వైఎస్ ప్రవేశపెట్టిన సంక్షేమ పథకాలు యథావిధిగా అమలు చేయాలని ప్రజల సహకారంతో ఆందోళన చేపడతామన్నారు.

# ఆగని ప్రోటోకాల్ రగడ

## ● ఆగష్టు 15 వేడుకల వేదిక దిగిన గూడూరు ఎమ్మెల్యే

ప్రొటోకాల్ లేకుండా ఎవరిని పడితే వారిని వేదిక మీదకు పిలవడం పట్ల గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసి కార్యక్రమం నుండి అర్థాంతరంగా వెళ్లడం చర్చనీయాంశమయ్యింది. గూడూరు ఆదిశేషారెడ్డి స్టేడియంలో స్వాతంత్ర్యదినోత్సవ వేడుకల సందర్భంగా జరిగిన సభకు ఎమ్మెల్యే హాజరయ్యాడు. కార్యక్రమం జరుగుతుండగా వేదిక మీదకు గూడూరు మార్కెట్ కమిటి ఛైర్మన్‌గా నూతనంగా నియమితుడైన బాబురెడ్డిని ఆహ్వానించారు. దీంతో బల్లి దుర్గాప్రసాద్ భగ్గుమన్నారు. ఇలాంటి సభలకు ఎవరిని పడితే వారిని ఆహ్వానిస్తారా? దారిన పోయే దానయ్యలను పిలుస్తారా అంటూ ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇదంతా ఎన్నికల్లో తనపై పోటీ చేసి ఓడిపోయిన వారి పనేనంటూ పనబాక కృష్ణయ్యను ఉద్దేశించి వ్యాఖ్యానించారు. ఆయన భార్య పలుకుబడిని ఉపయోగించి అధికారులను బెదరించి ఇలాంటి సిగ్గుమాలిన చర్యలకు పాల్పడుతున్నారని నిప్పులు చెరిగారు.



పిల్లలు వివరిస్తున్న నమూనాలను ఆసక్తిగా చూస్తున్న ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. ప్రక్కన ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసారత్నం.

# సైన్స్ ఎగ్జిబిషన్ భేష్

## విద్యార్థుల్లో ఎంత సృజనాత్మక శక్తి దాగుందో!

సూళ్లూరుపేట ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఆగష్టు 16వతేది నుంచి జరుగుతున్న జిల్లా వైజ్ఞానిక ప్రదర్శన 19వతేదితో ముగిసింది. ఈ సైన్సు ఎగ్జిబిషన్‌కు జిల్లా నలుమూలల నుంచి 1110 మంది విద్యార్థులు పాల్గొని వివిధ అంశాలపై తాము తయారు చేసిన నమూనాలను ప్రదర్శించారు. ఇందులో 950 ప్రభుత్వపాఠశాలల నుంచి, 160 ప్రైవేట్ పాఠశాలల నుంచి విద్యార్థులు పాల్గొన్నారు. ఈ ప్రదర్శనలో విద్యార్థులు ప్రదర్శించిన నమూనాలు శాస్త్రవిజ్ఞానంలో విద్యార్థుల ప్రతిభ పాటవాలకు అద్దం పడుతున్నాయి. ఇటీవల నెల్లూరులో జరిగిన తమిళనాడు ఎక్స్‌ప్రెస్ దుర్ఘటనకు స్పందించిన తడ మండలం అక్కంపేట ప్రాథమికోన్నత పాఠశాల విద్యార్థులు ప్రాణరక్షణకు పరిష్కార మార్గం చూపేలా ప్రయోగాల్ని ఆవిష్కరించారు. బోగీలో సైడు వేలు అమర్చడం వల్ల పొగలు వచ్చే సమయంలో సులభంగా తెలుస్తుందని, మీట నొక్కితే బోగీలోని ఒక భాగం పైకి లేచి ప్రయాణీకులు సురక్షితంగా బయటపడతారని చూపించారు. అలాగే వర్షాభావం నెలకొన్న పరిస్థితుల్లో తేమ ద్వారా బిందు సేద్యం చేసే ప్రయోగాన్ని కళ్లకు కట్టినట్లు చూపార. పొదలకూరు జడ్పీ పాఠశాల విద్యార్థులు. కోటపోలూరు విద్యార్థులు విద్యుత్ ఆదా చేసే విధానాన్ని, అక్కంపేట విద్యార్థులు ఇంటిని చల్లగా మార్చడాన్ని చేసి చూపిన వైనం వారిలో దాగి వున్న ప్రతిభను చాటి చెప్పింది. అలాగే జలదంకి మండలం లింగరాజు అగ్రహారం విద్యార్థులు ప్రదర్శించిన హెలికాప్టర్‌తో నేర పరిశోధన, జాతీయరహదారిపై సౌరశక్తితో విద్యుత్ వెలుగులు నింపేలా వెంకటాచలం మండలం తిరుమలమ్మపాళెం విద్యార్థులు ప్రయోగాన్ని చూపించారు. విద్యానగర్ విద్యార్థులు తయారు చేసిన శ్రీహరికోట రాకెట్ కేంద్రం నమూనా తదితర ప్రదర్శనలు ఆకట్టుకొన్నాయి. ముగింపు కార్యక్రమానికి షార్ డైరెక్టర్ చంద్రదత్తన్ విచ్చేసి విద్యార్థులను అభినందించారు. అనంతరం 55మంది ఎగ్జిబిట్స్‌ను రాష్ట్రస్థాయి వైజ్ఞానిక ప్రదర్శనకు ఎంపిక చేసినట్లు అధికారులు ప్రకటించారు.



నెల్లూరు వనంతోపులోని రాఘవ టాలెంట్ స్కూల్‌లో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ సంబరాల్లో ప్రసంగిస్తున్న మాజీ కార్పొరేటర్ ఆనం జయకుమార్‌రెడ్డి. ప్రక్కన ఆర్ఎస్ఆర్ .శ్రీనివాసులు, స్కూల్ కరస్పాండెంట్ వెంకటేశ్వరరావు వున్నారు.

# వెంకటగిరిని వీడను!



## రాజ్యలక్ష్మమ్మ స్పష్టీకరణ

రాజకీయ పరిస్థితులు ఎలా వున్నా తాను వెంకటగిరిని వదిలిపెట్టనని మాజీ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ స్పష్టం చేశారు. కొన్ని కారణాల వలన నియోజకవర్గానికి సరిగా రాలేకపోతున్నానే తప్ప నియోజకవర్గాన్ని వదిలి పెడుతున్నానన్న ప్రచారంలో వాస్తవం లేదన్నారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆమె తన నివాసంలో పార్టీ కార్యకర్తల సమావేశం నిర్వహించారు. 2009 ఎన్నికల తర్వాత నుంచి ఇప్పటివరకు 27.65 కోట్ల రూపాయలను వివిధ పథకాల ద్వారా ఈ ప్రాంత ప్రగతికి నిధులు తీసుకవచ్చానన్నారు. తాజాగా ఎంపి నిధుల నుంచి 1.56 కోట్లు మంజూరు చేయించినట్లు ప్రకటించారు. అలాగే ఉపాధిహామీ పథకం ద్వారా 2.25కోట్లు, చెరువుల మరమ్మత్తులకు 1.68 కోట్లు మంజూరు చేయించినట్లు రాజ్యలక్ష్మమ్మ తెలిపారు. వెంకటగిరి గ్రామశక్తి పోలేరమ్మ ఆలయ మండప నిర్మాణం కోసం 18.80 లక్షలు మంజూరయ్యాయని అయితే అక్టోబర్ 3,4 తేదీలలో జాతర వుండడంతో ఆ తర్వాత నిర్మాణ పనులు చేపడుతామని తెలిపారు. మునిసిపల్ కార్యాలయంలో అదనపు భవనాల నిర్మాణానికి 70లక్షలతో ప్రతిపాదనలు పంపుతున్నామన్నారు. కార్యకర్తలకు ఎల్లవేళలా అందుబాటులో వుంటానని స్పష్టం చేశారామె.



నెల్లూరు పెద్దాస్పత్రిలోని బ్లడ్ బ్యాంకులో ఉత్తమ సేవలకుగాను ఆగస్టు 15తేదీ ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి చేతుల మీదుగా పురస్కారాన్ని అందుకొంటున్న డాక్టర్ కృష్ణమూర్తి. చిత్రంలో ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, పెద్దాస్పత్రుల సమన్వయకర్త డాక్టర్ నిర్మలమ్మ, డిఆర్వో రామిరెడ్డి వున్నారు.

# స్మగ్లింగ్ నిరోధానికి బేస్ క్యాంపులు!

## అటవీ శాఖాధికారి పికె.సారంగి

ఎర్రచందనం స్మగ్లింగ్‌ను అరికట్టేందుకు బేస్ క్యాంపులు నిర్వహిస్తామని అటవీశాఖ అడిషనల్ ప్రిన్సిపల్ చీఫ్ కన్సర్వేటర్ పికె.సారంగి వెల్లడించారు. వెంకటగిరికి వచ్చిన ఆయన ఎర్రచందనం గోడౌన్లను పరిశీలించారు. ఈ సందర్భంగా విలేకరులతో మాట్లాడారు. రాష్ట్రంలోని అటవీశాఖ గోడౌన్లలో వున్న ఎర్రచందనం దుంగలను గ్లోబల్ టెండర్ల ద్వారా వేలం నిర్వహించనున్నట్టు తెలిపారు. దీనికి సంబంధించి కేంద్రప్రభుత్వ అనుమతులు వచ్చాయన్నారు. త్వరలో వేలంపాట ప్రక్రియను చేపడుతామన్నారు. విదేశాలలో ఎర్రచందనానికి వున్న డిమాండ్ దృష్ట్యా భారీగా స్మగ్లింగ్ జరుగుతున్నదన్నారు. వీటిని అరికట్టి వృక్షాలను కాపాడుకోవల్సిన బాధ్యత అటవీశాఖతో పాటు ప్రతి ఒక్కరిపై వుందన్నారు. అంతరిస్తున్న ఎర్రచందనం వృక్షాలను దృష్టిలో వుంచుకొని కొత్తగా ఎర్రచందనం మొక్కల పెంపకాన్ని చేపడుతున్నామన్నారు. ఇందుకు నిధులు మంజూరయ్యాయన్నారు. కేంద్రప్రభుత్వ అధ్యయనంలో అడవుల్లోని ఎర్రచందనం నాణ్యత తగ్గుతున్నట్లు తెలుస్తున్నదన్నారు. స్మగ్లింగ్‌ను నిరోధించేందుకు అటవీశాఖ సిబ్బందికి తుపాకులు అందించే యోచనలో వున్నామన్నారు. అలాగే బేస్ క్యాంపులు, స్ట్రయికింగ్ బలగాలు, అటవీ రక్షణ దళాలు, డాగ్ స్క్వాడ్ వంటివి ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. రాష్ట్రంలోని 20వేల హెక్టార్లలో సామాజిక అడవుల పెంపకం చేపడుతున్నామన్నారు.

● పని చేయకుంటే...

# సెలవు పెట్టి వెళ్లండి!

## రెవిన్యూ అధికారులపై బీద ఆగ్రహం



చిన్న చిన్న సమస్యలను సైతం పరిష్కరించకుండా ప్రజలను కార్యాలయాల చుట్టూ తిప్పుకోవడం సరైన విధానం కాదని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఆగ్రహం వ్యక్తం చేశారు. నియోజకవర్గ పరిధిలోని దగదర్తి, బోగోలు మండలాల్లో జరిగే గ్రీవెన్స్ సెల్‌కు హాజరై అక్కడి పరిస్థితులను పరిశీలించారు. ఈ సందర్భంగా పలువురు వివిధ సమస్యలపై ఎంతో కాలంగా మండల కార్యాలయాల చుట్టూ తిరుగుతుండడాన్ని గమనించి అధికారులను నిలదీశారు. త్రాగునీటి సమస్య పరిష్కరించడంలో నిర్లక్ష్యం వహిస్తున్నారని, పలుమార్లు హెచ్చరించినా అధికారులు, సిబ్బందిలో మార్పు రావడంలేదన్నారు. ప్రజల సమస్యలను పరిష్కరించడంలో శ్రద్ధ వహించండి, లేదంటే సెలవుపెట్టి వెళ్లిపోవాలని మండిపడ్డారు. పేదవాళ్లను రోజుల తరబడి తిప్పుకోవడం వలన వాళ్ల కూలికి పోకుండా మీ చుట్టూ తిరుగుతున్నారని, అలా చేస్తే వారి ఉసురు మీకు తగులుతుందన్నారు. రెవెన్యూ గృహనిర్మాణశాఖ, విద్యుత్‌శాఖ అధికారుల తీరును తప్పుపట్టారు. ఇకనైనా పద్ధతి మార్చుకొని సక్రమంగా పని చేయాలని సూచించారు.

● గిరిజనులు

# చైతన్యవంతులు కావాలి!

## ఐటిడిఏ ప్రాజెక్ట్ డైరెక్టర్ ఆకాంక్ష

గిరిజనులు చైతన్యవంతులై ప్రభుత్వ పథకాలను సద్వినియోగం చేసుకోవాలని జిల్లా గిరిజనాభివృద్ధి సంస్థ ప్రాజెక్టు డైరెక్టర్ వెంకటేశ్వర్లు సూచించారు. గిరిజన ఐక్యవేదిక స్థానికంగా ఏర్పాటు చేసిన సభలో ఆయన పాల్గొని ప్రసంగించారు. గిరిజనుల్లో నేటికీ నిరక్షరాస్యులు అధికంగా వున్నారని, వీరంతా అక్షరాస్యులు కావాలన్నారు. అక్షరాస్యత శాతం పెరగడంతోటే అభివృద్ధి జరుగుతుందని గుర్తుంచుకోవాలన్నారు. ఐటిడిఏ ఆధ్వర్యాన జిల్లాలో గిరిజనుల సమస్యల పరిష్కారానికి చర్యలు తీసుకొంటున్నామన్నారు. ఈ సందర్భంగా పలువురు గిరిజనులు తాము ఎదుర్కొంటున్న సమస్యలను అధికారుల దృష్టికి తీసుకొని వచ్చారు. అధికభాగం గిరిజనులు నేటికీ అడవులపై ఆధారపడి జీవిస్తున్నారని, వ్యవసాయం చేసుకోవాలన్నా బోర్లు లేవని, ఒకటి రెండు చోట్ల వున్నా విద్యుత్ సౌకర్యం ఇంతవరకు ఇవ్వలేదని తెలిపారు. గిరిజనుల ఆధీనంలో వున్న భూములకు పట్టాలివ్వడంలో జాప్యం జరుగుతుందన్నారు. జిల్లాలో అవసరమైన చోట్ల గిరిజనులకు పాఠశాలలు ఏర్పాటు చేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో గిరిజన ఐక్యవేదిక నాయకులు వెంకటపతి, గోవిందయ్య, మురళి, శివయ్య, మార్పు స్వచ్ఛంద సంస్థ కన్వీనర్ పవన్ తదితరులు పాల్గొన్నారు.

# రామనారాయణను చూసి నేర్చుకొనేదేమిటి?

## బల్లి దుర్గాప్రసాద్ వెటకారం

ఓడిపోయిన వ్యక్తులను తీసుక వచ్చి అభివృద్ధి కార్యక్రమాలలో పెద్దపీట వేస్తూ శాసనసభ్యుడినైన తనను నిర్లక్ష్యం చేయడంపై గూడూరు ఎమ్మెల్యే బల్లిదుర్గాప్రసాద్ మండిపడ్డారు. ఇటీవల గూడూరు నియోజకవర్గంలో పలు అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించేందుకు వచ్చిన ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి పనులు చేయడం నేర్చుకోవాలని వ్యాఖ్యానించడంపై ఆయన తీవ్రంగా స్పందించారు. కాంగ్రెస్‌పార్టీ వారిని, ఆనం సోదరులను చూసి భూకబ్జాలు, అవినీతికి పాల్పడడాన్నా ఏది నేర్చుకోవాలని ప్రశ్నించారు. పార్టీలు మారే ఆనం రామనారాయణరెడ్డికి తనను విమర్శించే అర్హత లేదన్నారు. గూడూరు పట్టణంలో గతంలో మంజూరైన నిధులకు సంబంధించి ఖర్చులు లెక్కలు లేవని, తాజాగా మంజూరు చేసిన వాటి పరిస్థితి ఏమిటని ప్రశ్నించారు. అధికారపార్టీ నాయకులు, కార్యకర్తలను దృష్టిలో వుంచుకొని నిధులు కేటాయిస్తున్నారని విమర్శించారు. స్థానిక ఎమ్మెల్యే అయిన తనకు సమాచారం లేకుండా ఓడిపోయిన వారిని కార్యక్రమాలకు తీసుకవచ్చి సభాధ్యక్షత ఎలా ఇస్తారని ఆగ్రహించారు.

# వినికిడి యంత్రాల పంపిణీ ఎప్పుడో?

ఇటీవల ఆర్భాటంగా నిర్వహించిన విద్యాపక్షోత్సవాల సందర్భంగా బధిర విద్యార్థులకు ఇస్తామన్న వినికిడి యంత్రాలు ఇంకా ఎవరికీ అందకపోవడంతో విద్యార్థుల్లో అయోమయం నెలకొంది. వినికిడి యంత్రాలను పంపిణీ చేసేందుకు ఆర్‌విఎంకు లక్షలాది రూపాయల నిధులు ప్రభుత్వం మంజూరు చేసింది. అధికారులు అవసరమైన విద్యార్థులకు వీటిని అందచేస్తామని ప్రకటించినా ఇంతవరకు అందలేదు. ఇందుకూరుపేట తదితర మండలాల్లో విద్యార్థులు వీటిని ఎప్పుడు ఇస్తారోనని ఎదురు చూడాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. అధికారులు వీటినైనా సక్రమంగా పంపిణీ చేసి ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలని విద్యార్థుల తల్లిదండ్రులు కోరుతున్నారు.

# వెంకటగిరిలో క్షీణించిన పారిశుధ్యం!



నెల్లూరు పొగతోటలోని ప్రభవ తొలిబడిలో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో పిల్లలతో చంద్రలత.

వెంకటగిరి నియోజకవర్గంలో పారిశుధ్యం అస్తవ్యస్తంగా వుంది. పట్టణం, పల్లె అనే తేడా లేకుండా ఎక్కడ చూసినా మురుగునీరు, చెత్త కుప్పలే దర్శనమిస్తున్నాయి. పట్టణంలో మునిసిపాల్టీ సిబ్బంది సక్రమంగా విధులు నిర్వహించకపోవడంతో ఎక్కడికక్కడ పారిశుధ్యం క్షీణించిపోతోంది. ఇక గ్రామాల్లో పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది. మురుగునీరు పోయేందుకు మార్గం లేక, వున్న కాలువలు పూడిపోయి, చెత్త పేరుకుపోయి దోమల ఉత్పత్తి కేంద్రాలుగా మారి ప్రజలను తీవ్రంగా ఇబ్బందులకు గురి చేస్తున్నాయి. ప్లాస్టిక్ కాలుష్యం అధికమవుతోంది. మండల కేంద్రాలతోపాటు వివిధ గ్రామాల్లో ఎక్కడ చూసినా ప్లాస్టిక్ కవర్లు, చెత్తకుప్పలే కన్పిస్తున్నాయి. కాలువల్లో సైతం ఇవి చేరి నీటి పొరుదలకు అడ్డంకిగా మారుతున్నాయి. పంచాయితీలకు పాలకవర్గం లేక ప్రత్యేకాధికారుల పాలనలో కొనసాగుతుండడంతో పారిశుధ్యం గురించి పట్టించుకొనే

### మునిసిపల్ సిబ్బంది విధులు మరిచారు

నాధుడే లేక పారిశుధ్యం మరింతగా క్షీణించింది. ఇంతగా పరిస్థితులు అధ్వాన్నంగా మారినా సంబంధిత అధికారులు గానీ, ప్రత్యేకాధికారులు గానీ పట్టించుకోకపోవడంతో అన్ని ప్రాంతాలు ముదనష్టంగా తయారౌతున్నాయి.

## కావలిలో విలువైన స్థలం కబ్జాకు యత్నం!

### పట్టించుకోని అధికారులు

కావలిలో భూముల ధరలకు రెక్కలు రావడంతో కబ్జాదారులు ఖాళీ స్థలం కన్పిస్తే చాలు కబ్జా చేసేస్తున్నారు. స్థానిక వెంగళరావు నగర్‌లో అష్టలక్ష్మీ దేవాలయం ప్రక్కన గల స్థలాన్ని కొందరు కబ్జాకు యత్నించడం గగ్గోలు రేపింది. ఆలయం ప్రక్కనే 200 అంకణాల ప్రభుత్వ స్థలం వుంది. దీని విలువ 50లక్షల పైమాటే. కొందరు ఒక సంస్థ పేరుతో దీనిని ఆక్రమించేందుకు రంగం సిద్ధం చేశారు. దీనిపై రెవెన్యూ సిబ్బందికి సమాచారం అందించినా పట్టించుకోకపోవడం వెనుక పలు అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ఈ స్థల ఆక్రమణపై తెలుగుదేశం ఎస్సీ సెల్ రాష్ట్ర కార్యదర్శి కల్లయ్య మాట్లాడుతూ విలువైన స్థలాన్ని కాజేసేందుకు కొందరు యత్నిస్తున్నారని వీరికి కాంగ్రెస్ పార్టీ మాజీ కౌన్సిలర్లు, మరికొందరు అధికార పార్టీ నేతలు అండదండలు అందిస్తున్నారని ఆరోపించారు. స్థలం కబ్జా చేస్తున్నారని రెవెన్యూ అధికారులకు తెలిపినా పట్టించుకోవడం లేదని కబ్జాదారులతో అధికారులకు సంబంధాలున్నాయని అనుమానించాల్సి వస్తోందన్నారు. తక్షణం ఈ స్థలాన్ని కాపాడాలన్నారు.

## ఉపాధి పనుల్లో 12లక్షల దుర్వినియోగం!

బోగోలు మండలంలో జరిగిన ఉపాధిహామీ పనుల్లో 12 లక్షల రూపాయలు దుర్వినియోగం జరిగింది. మండలంలోని 16 పంచాయితీల్లో సామాజిక తనిఖీ బృందం జరిపిన పరిశీలనలో ఈ విషయం వెల్లడైంది. ఆయా పంచాయితీల్లో జరిగిన పనులను లోతుగా పరిశీలించిన బృందం లక్షల రూపాయల నిధులు దుర్వినియోగం అయినట్లు తేల్చి చెప్పింది. ఎం బుక్‌లకు, చేసిన పనులకు పొంతన లేకుండా వుందని తనిఖీ అధికారులు తెలిపారు. ఈ సందర్భంగా వీరికి, ఉపాధిహామీ సిబ్బందికి మధ్య వాదోపవాదాలు జరిగాయి. డ్వామా ఎపిడి రవికుమార్, క్లస్టర్ పర్యవేక్షకులు ప్రసాదరావు, తనిఖీ అధికారిణి కిరణ్మయి, ఎంపిడిఓ కనకదుర్గా భవాని తదితరులు పాల్గొన్నారు.

● దెబ్బతినిపోయిన

## కొడవలూరు రోడ్డు!

### ఈ మధ్యే వేశారు

లక్షలు వెచ్చించి నిర్మించిన కొడవలూరు ఆర్‌అండ్‌బి రోడ్డు కొద్ది కాలానికే రూపురేఖలు కోల్పోయింది. మండల కేంద్రమైన ఈ ప్రాంతంలో కొన్ని నెలల క్రిందట రోడ్డు నిర్మించారు. నాణ్యతా ప్రమాణాలు పాటించకపోవడం, అధికారులు పట్టించుకోకపోవడంతో గుంటలమయంగా మారింది. స్థానిక పంచాయితీ కార్యాలయం ఎదురుగా నిర్మించిన ఈ రోడ్డు అధ్వాన్నంగా మారడంతో దీనిపై రాకపోకలు సాగించేవారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఇక వర్షం వస్తే గుంటలు పడి వున్న ఈ రోడ్డు నీటితో నిండి చెరువును తలపిస్తోంది. ఈ రోడ్డు వెంట వెళ్లాలంటేనే ప్రయాణీకులకు నరకం కన్పిస్తోంది. ఇప్పటికైనా అధికారులు స్పందించి రోడ్డు మరమ్మత్తులు చేపట్టాలని కోరుకొంటున్నారు.

## అందుబాటులోలేని రెవిన్యూ సేవలు!

బోగోలు మండల తహశీల్దార్ కార్యాలయంలో పనులు జరగక వివిధ సమస్యలపై వచ్చేవాళ్లు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. కుల, ఆదాయ ధృవీకరణ పత్రాలు, ఇతరత్రా సర్టిఫికెట్ల కోసం వచ్చేవారు తమ పనులన్నీ మానుకొని రోజుల తరబడి కార్యాలయం చుట్టూ తిరగాల్సి వస్తోంది. రైతులు పాసు పుస్తకాల కోసం చెప్పులరిగేలా తిరుగుతున్నారు. ప్రజాసమస్యలు పరిష్కరించడంలో బాధ్యతాయుతంగా వ్యవహరించాలని ఉన్నతాధికారులు పదేపదే ఆదేశాలు జారీ చేస్తున్నా రెవెన్యూ సిబ్బందిలో మార్పు రాకపోవడంతో వివిధ పనులపై రెవెన్యూ కార్యాలయానికి వచ్చే వాళ్లు ఇబ్బంది పడక తప్పడం లేదు. అధికారులు ఎప్పుడు వస్తారు? ఎప్పుడు సర్టిఫికేట్ ఇస్తారోనని ఎదురు చూస్తూ చెట్ల క్రిందే ఎండా, గాలికి ఎదురు చూపులు చూడాల్సి వస్తోంది. దీనికి తోడు అల్లరి మూకల ఆగడాలు అధికం కావడంతో వివిధ ధృవీకరణ పత్రాల కోసం వచ్చే విద్యార్థినులు, మహిళలు కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు. అల్లరి మూకల వెకిలి చేష్టలు భరించలేకపోతున్నామని, రెవెన్యూ అధికారులు పట్టించుకోకపోవడంతో వీరి ఆగడాలు అధికం అవుతున్నాయని వాపోతున్నారు. దగదర్తి మండలంలోనూ ప్రజల సమస్యలు పరిష్కారానికి

### బోగోలు, దగదర్తి, అల్లూరులది ఒకటే బాట

నోచుకోవడం లేదు. అల్లూరులోనూ ఇదే పరిస్థితి. సిబ్బంది బయటి ప్రాంతాల నుంచి వస్తుండడంతో ఎప్పుడు కార్యాలయానికి వస్తారో, ఎప్పుడు వెళ్తారో తెలియని పరిస్థితి. దీంతో ప్రజలకు తిప్పలు తప్పడం లేదు.

# అస్సాంలో మానవ విషాదం!

అస్సాం మన దేశంలో ఒక అంతర్భాగం. బోడో జాతి ప్రజలు భారతీయులు. కానీ ఆ రాష్ట్రంలో నెత్తుటి ఏర్లు పారుతున్నాయి. ఆ జాతి ప్రజలు ఇళ్లు, వాకిలి కోల్పోయి శరణార్థులుగా మారి హీనమైన జీవితం గడుపుతున్నారు. తినడానికి చాలినంత తిండి లేదు. చిన్న చిన్న పాఠశాల గదులలో వందల మంది నివసించాలి. మరుగుదొడ్లు లేవు. స్నానానికి నీళ్లు లేవు. పారిశుధ్యం లేకపోవడంతో రకరకాల జబ్బులు. పసి పిల్లలు,



తగలబడిపోతున్న గృహాలు.

ముదుసలులు పిట్టలు రాలినట్లు రాలి పోతున్నారు. చనిపోయిన వారిని పూడ్చడానికి శ్మశానాలు లేవు. తమ ఆత్మీయులు, కుటుంబ సభ్యులు తమ కళ్ల ముందే ఆకలి చావుతో, మందులు దొరకని హీన స్థితిలో మరణించడం ఒక బాధ అయితే, వారిని ప్రభుత్వం అనాథ శవాల వలె ఈడ్చి పారేయడం ఇంకా మనసు నొప్పించే విషాదం.

## జాలిపడే వారేరి?

నాలుగు జిల్లాలలో ఐదు లక్షల మంది ప్రజలు ఇట్లా నిరాశ్రయులుగా మారారు. 500కి పైగా గ్రామాలకు గ్రామాలు మంటల్లో మాడి మసైపోయాయి. బూడిద కుప్పలు మిగిలాయి. ఇళ్లు లేవు. ఇంట్లో కనీసం వంట పాత్రలు కూడా మిగలలేదు. పశువులు చనిపోయాయి. లేదంటే కట్లు విప్పుకొని ఏ కొండల మీదకో వెళ్లిపోయాయి. పొలాలు బీడు పడ్డాయి. పంటలు నాశనమైపోయాయి. శరణార్థ శిబిరాలలో పశువుల వలె బ్రతకలేరు. అట్లని తిరిగి ఇళ్లకు వెళ్లలేరు. తలచు



సైన్యం పహారా వున్నా అల్లర్లు ఆగడం లేదు.

కొంటేనే మనసు కలతకు గురయ్యే దారుణ విషాదం. కానీ దేశంలో ఒక్కరికీ వారి దౌర్భాగ్యం పట్టదు. అస్సాం రాష్ట్ర ప్రభుత్వం కేంద్రాన్ని నిందిస్తున్నది. కేంద్ర ప్రభుత్వం అస్సాం రాష్ట్ర ప్రభుత్వం చేతకానిదని వెటకారం చేస్తున్నది. అంతే తప్ప దేశ చరిత్ర పుటల్లో నల్లటి సిరాతో లిఖితమౌతున్న ఈ మానవ విషాదాన్ని ఒక్కరూ పట్టించుకోవడం లేదు. ప్రభుత్వాలే కాదు – ప్రజలు కూడా. వందలాది టీవీ ఛానళ్లు, వేలాది పత్రికలు, క్షణాలలో సమాచారాన్ని ఎక్కడ నుంచి ఎక్కడికైనా బదలీ చేయగల అపారమైన సాంకేతిక పరిజ్ఞానం కల్గిన దేశంలో, తోటి మనుషులు అనుభవిస్తున్న దారుణమైన అమానవీయమైన దుర్గతిని చూసి కనీసం జాలి పడే వారు కూడా లేరు.

## అందరికీ అలుసే!

ఈశాన్య రాష్ట్రాలంటే ఈ దేశంలో అందరికీ అలుసే. అవి మనవి కావన్న భావన సర్వత్రా నెలకొని వుంది. అట్లని వాటిని వదలుకొనే ఉదారత్వం ఎవరికీ లేదు. దేశ రక్షణకు అవి కీలక దుర్గాలు. ఆ కోటలకు ఏ కొంచెం బీటలు వారినా దేశ సరిహద్దులు శత్రువుల నివాసాలుగా మారుతాయి. అందువల్ల కేంద్ర ప్రభుత్వం ఈశాన్య రాష్ట్రాలను సైనిక బలగాల బసగా వాడుకొంటుంది. అంతే తప్ప ఆ రాష్ట్రాలలో నివసించే ప్రజలను తోటి భారతీయులుగా చూడదు. బ్రిటీష్ కాలం నుంచి ఈశాన్య రాష్ట్రాల ప్రజలు ఇదే దురవస్థ అనుభవిస్తున్నారు.

## రవాణా సౌకర్యాలు లేవు

ఈశాన్య రాష్ట్రాల జనాభా తక్కువ. అందువల్ల లోక్‌సభ సభ్యుల సంఖ్య తక్కువ. దానితో ఏ జాతీయ పార్టీకీ ఈ రాష్ట్రాల మీద శ్రద్ధ వుండదు. అక్కడి ప్రజల జీవితాలను బాగు చేయాలన్న చిత్తశుద్ధి ఎవరికీ వుండదు. తతిమా దేశంతో వారికి సంబంధాలు వుండవు. రాకపోకలు చాలా కష్టం. అరుణాచల్ ప్రదేశ్‌కు వెళ్లాలంటే హెలికాప్టర్ ఒక్కటే మార్గం. రోడ్డు మార్గమైతే కొండల మధ్యన రోజుల తరబడి ప్రయాణించాలి. త్రిపుర రాజధాని అగర్తలకు కలకత్తా నుంచి విమానంలో ప్రయాణిస్తే సరిగ్గా అరగంటలో చేరుకొంటాము. కానీ రైలు ఎక్కితే ఐదు రోజులు పడుతుంది. దాన్నిబట్టే ఈశాన్య రాష్ట్రాలకు, తతిమా భారత దేశానికి ఎంత ఎడం వుందో అర్థం చేసుకోవచ్చు. ప్రభుత్వాల నిర్లక్ష్యం వల్ల, ప్రకృతి సహకరించక పోవడం వల్ల ఈ రాష్ట్రాలలో నిరుద్యోగ సమస్య చాలా అధికం. చేయడానికి పని వుండదు. కొండ ప్రాంతం కాబట్టి వ్యవసాయానికి చాలినంత భూమి వుండదు. దానితో దుర్భర దారిద్ర్యం.

## వేర్పాటు ఉద్యమాలు

ఈ నిరుద్యోగం, అభివృద్ధి లేమి వల్లనే అస్సాం, నాగాలాండ్, మణిపూర్, త్రిపుర వంటి రాష్ట్రాలన్నిటిలో వేర్పాటు ఉద్యమాలు పుట్టాయి. భారత దేశం నుంచి విడిపోవాలన్న ఆకాంక్ష ప్రజలలో కల్గింది. ఆ ఉద్యమాలను సైనిక బలగాలతో ఉక్కుపాదంతో అణిచి వేయడం తప్ప అసలు సమస్య మూలాలలోకి ఏ జాతీయ ప్రభుత్వమూ వెళ్లలేదు. ఈనాటికీ మణిపూర్ రాజధాని ఇంఫాల్‌కు వెళ్తే, మనల్ని విదేశీయులుగా చూస్తారు అక్కడి ప్రజలు.

## బోడోలు X ముస్లింలు!

ఇప్పటి అస్సాం మానవ విషాదానికి కూడా కారణాలు ఇటువంటివే. అస్సాం మధ్యలో బ్రహ్మపుత్ర నది ప్రవహిస్తున్నది. దానికి ఉత్తర గట్టు వైపున ప్రాంతాన్ని బోడోల్యాండ్ అని పిలుస్తారు. కొన్ని వేల సంవత్సరాలుగా బోడో జాతి ప్రజలు నివసించే ప్రాంతం అది. బ్రహ్మపుత్ర జీవనది. సంవత్సరం పొడవునా వరదలుంటాయి. దానితో ఆ వైపు నుంచి ఈ వైపుకు రాకపోకలు చాలా కష్టం. అస్సాం రాజధాని గౌహతి వరకు వారు రాలేరు. దానితో ఆ రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగాలన్నీ అస్సాం జాతి ప్రజలకే దక్కాయి. మరొకప్రక్క పొరుగునే వున్న బంగ్లాదేశ్ నుంచి లక్షల సంఖ్యలో పేద ప్రజలు ఈ ప్రాంతానికి వలస వచ్చి, స్థిరపడ్డారు. వారంతా బెంగాలీ మాట్లాడే ముస్లింలు. బోడో జాతి ప్రజల అమాయకత్వాన్ని దుర్వినియోగం చేసి, వారు భూములను చవక ధరలకు స్వంతం చేసుకొన్నారు. అది స్థానికంగా తీవ్ర అసహనానికి దారి తీసింది. రెండు వర్గాల మధ్య ఘర్షణ వాతావరణం ఏర్పడింది. ప్రత్యేక బోడోల్యాండ్ ఉద్యమ సమయంలో ఈ బెంగాలీ ముస్లింల మీద దాడులు



మరణ మృదంగం.

చేశారు. కాంగ్రెస్ పార్టీ దాన్ని ఆసరాగా తీసుకొని, వారందరికీ ఓటు హక్కు కల్పించి, వారి మద్దతుతో రాజకీయంగా లాభపడింది. అది బోడో ప్రజలను మరింత ఆగ్రహానికి గురి చేసింది. ఉద్యమం హింసాత్మకంగా మారింది. కొన్ని వేల మంది బెంగాలీ ముస్లింలను గ్రామాల నుంచి తరిమి వేశారు. 1993, 1996లలో ఈ విషయమై జరిగిన హింసలో వందలాది మంది వూచకోతకు గురైనారు. గ్రామాలకు గ్రామాలు భస్మమై పోయాయి. విధిలేని పరిస్థితుల్లో కేంద్ర ప్రభుత్వం బోడోల్యాండ్ క్రింద నాలుగు జిల్లాలను గుర్తించి, వారికి పరిమిత స్థాయిలో స్వయం పాలనాధికారం ఇచ్చింది. ఈ



శిబిరాల్లో బాధితులు.

ప్రాంతంలోని భూమిని కొత్తగా వచ్చేవారు కొనడానికి లేదనే శాసనం చేశారు. దానితో బెంగాలీ ముస్లింలు అనాథలై పోయారు. వారికి ఓటు హక్కు కూడా లేకుండా పోయింది. వారిని తిరిగి బంగ్లాదేశ్‌కు పంపడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఒకసారి దేశం దాటిన వారిని బంగ్లాదేశ్ ప్రభుత్వం మళ్లీ వెనక్కు రానివ్వలేదు. అసలే పేదరికంతో మ్రగ్గే తాము ఈ శరణార్థుల భారం మోయలేమని నిక్కచ్చిగా తేల్చి చెప్పింది. దానితో బెంగాలీ ముస్లింలు రెండు దేశాలకు పనికిరాని వారైపోయారు.

## వైరభావం తగ్గలేదు

ఇప్పుడు అస్సాంలో నడుస్తున్న హింసకు నేపథ్యం ఇదీ. బోడోల్యాండ్ స్వయంప్రతిపత్తి మండలి ఏర్పడిన తర్వాత ఉద్యమకారులు హింసను విడనాడారు. కానీ రెండు వర్గాల మధ్య మానసిక బంధం మాత్రం ఏర్పడలేదు. ఆ సఖ్యత కుదర్చడానికి ప్రభుత్వాలు, పౌర సమాజం కూడా ప్రయత్నం చేయలేదు. దానితో రెండు వర్గాల మధ్య అనుమానం,

కొరవ 14వ పేజీలో



నెల్లూరు డిప్యూటీ లేబర్ కమిషనర్ రఘురామయ్య కుమారుడు రత్నరఘు వంశీకుమార్, త్రివేణిల వివాహం 8తేది వాయుగండ్ల బ్రహ్మయ్య కళ్యాణ మండపంలో జరిగింది.

# పిలిస్తే పలికే దైవం వెంకయ్యస్వామి!



పిలిస్తే పలికే దైవంగా, భక్తుల పాలిట కొంగు బంగారమై వెలసిల్లుతున్న స్వామి గొలగమూడి వెంకయ్యస్వామి. గొలగమూడిలో వెలసియున్న ఆ స్వామి ఆరాధనోత్సవాలు ప్రతి ఏటా ఆగష్టు నెలలో జరుగుతాయి. వారం రోజులపాటు నిర్వహించే ఈ ఉత్సవాలకు జిల్లా నలుమూలల నుంచే కాక రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలతోపాటు తమిళనాడు, కర్నాటక తదితర రాష్ట్రాల నుంచి భక్తులు అధికసంఖ్యలో హాజరవుతారు. శ్రీశ్రీశ్రీ భగవాన్ వెంకయ్యస్వామిని దర్శించుకొన్నట్లయితే కష్టాలు తొలగుతాయని, అనుకొన్న పనులు నెరవేరుతాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం. ఈ విశ్వాసంతోనే అక్కడకు వచ్చే భక్తుల సంఖ్య నానాటికి పెరుగుతోంది. సర్వజీవుల పాలిట సమానత్వం చూపాలని, ఆదరించాలని, ఆకలిగొన్న వారికి అన్నం పెట్టాలని, ఎదుటివారిపై దయ చూపాలని స్వామి చెప్పిన మాటలు ఆచరిస్తూ స్వామి చూపిన మార్గంలో నడుస్తున్నారు భక్తులు. వెంకయ్యస్వామి కృపాకటాక్ష వీక్షణాల కోసం నిత్యం ఎంతోమంది భక్తులు గొలగమూడికి వస్తుంటారు. స్వామిపై అచంచల విశ్వాసంతో, భక్తిభావంతో ఓం నారాయణ ఆదినారాయణ అనే నామస్మరణంతో నిత్యం ఆ ప్రాంతం మారుమ్రోగుతుంటుంది.

భగవాన్ శ్రీ వెంకయ్యస్వామిని సాక్షాత్తు మూర్తీభవించిన దత్తతత్వమని, సద్గురువని కొలుస్తారు భక్తులు. వెంకయ్యస్వామి జన్మస్థలం చేజర్ల మండలం నాగులవెల్లటూరు. ఆ గ్రామంలో పిచ్చయ్య, పెంచలమ్మల దంపతులకు జన్మించిన వెంకయ్యస్వామి చిన్నతనం నుండే తనలోని మహిమలను చాటి చెప్పేవారు. నీతి బోధనలు చేసేవారు. ఏ పని చేసినా ఎంతో శ్రద్ధతో చేసేవారు. యుక్తవయస్సు వరకు వ్యవసాయం పనులు చేయడం, కట్టెలు కొట్టి నెల్లూరుకు తీసుకవెళ్లి అమ్మడం చేసేవారు. స్వామిగా భక్తుల నుంచి పూజలు అందుకోని నాటి నుంచి ఆధ్యాత్మిక బోధనలు చేస్తున్నా, ఎన్నో విలువైన పలుకులు నోటి నుండి వెల్లడిస్తున్నా అవి జనానికి అర్థం అయ్యేవికావు. వున్నట్లుండి ఏదో జపిస్తూ, అరుస్తూ ఊర్లో పరుగెడుతుండేవారు. ఎవరికి దొరకకుండా పొలాల్లోకి పరుగిడడం, అంటరానితనం వేళ్లూనికొని వున్న రోజుల్లో వాటిని పట్టించుకోక వారి ఇళ్లకు వెళ్లి అన్నం పెట్టించుకొని తినడం చేసేవారు. స్వామి జ్ఞానాన్ని, ఆయనలోని దైవత్వాన్ని గ్రహించలేక ఒక్కొక్కసారి కట్టేసి కొట్టడం, భూత వైద్యులను పిలిపించి చికిత్స చేయించేవారు. అయినా పరిస్థితిలో మార్పు రాకపోవడంతోపాటు వెంకయ్యస్వామి పలికే మాటలు ఎవరికి అర్థంకాక పిచ్చిముదిరిందని అనుకొని అందరూ పిచ్చి వెంకయ్యగా




పిలవసాగారు. అక్కడ నుంచి ఊరు విడచి అడవుల్లో తిరుగుతూ, దేశ సంచారం చేస్తూ చివరకు గొలగమూడిలో స్థిరపడి భక్తులకు దర్శనమిస్తూ శరీరాన్ని వదలిపెట్టారు. ఆనాటి నుంచి దినదిన ప్రవర్ధమానం చెందుతూ గొలగమూడి భక్తులను విశేషంగా ఆకర్షిస్తోంది. ఇక్కడకు వచ్చే భక్తులు వెంకయ్యస్వామి సమాధిని, ఆయన తిరుగాడిన పరిసరాలను దర్శించుకొన్నట్లయితే కోరిన కోర్కెలు నెరవేరుతాయని వారి నమ్మకం. దీంతో ఈ ప్రాంతానికి వచ్చే భక్తుల సంఖ్య రెట్టింపు కావడంతో ఆలయాన్ని అభివృద్ధి చేశారు. వెంకయ్యస్వామికి అగ్నిగుండం అంటే ప్రీతి కాబట్టి ఆలయ ప్రాంగణంలో స్వామివారికి ఎడమవైపున ధుని నిత్యం వెలుగుతూనే వుంటుంది.

అవదూత వెంకయ్యస్వామి ఆలయానికి వచ్చే భక్తుల సౌకర్యార్థం వసతి సౌకర్యాలను ఏర్పాటు చేస్తున్నది ఆలయకమిటి. నిత్యం అన్నదాన కార్యక్రమాన్ని నిర్వహించడంతోపాటు భక్తులు వుండేందుకు కాటేజీలను నిర్మించారు. పాఠశాలలను, భోజనశాలను దాదాపు 8 కోట్ల రూపాయలతో నిర్మించారు. ఈ ఏడాది జరుగనున్న 30వ ఆరాధనోత్సవాలకు ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. ఆగష్టు 18వతేది సర్వభూపాల, కల్పవృక్షవాహన సేవలతో ప్రారంభమైన ఉత్సవాలు 24వ తేదిన జరిగే రథోత్సవంతో ముగియనున్నాయి.



క్రైం కార్నర్

# తడ బస్సు హత్యల సైకోనేనా?

## పోలీసులు పట్టుకొన్న వ్యక్తిపై ప్రజలకు కుదరని నమ్మకం

గత కొన్నిరోజులుగా జిల్లావాసులను కలవరపెట్టిన తడ బస్సు హత్యకేసుల నిందితుడిని ఎట్టకేలకు పోలీసులు పట్టుకొన్నారు. ఎస్ఎంఎస్ ఆధారంగా కూపీ లాగితే హంతకుడు పోలీసులకు చిక్కాడు. రాష్ట్రంలో సంచలనం సృష్టించిన ఈ ఘటన పోలీసులకు సవాల్‌గా మారడంతో ఐజి హరీష్‌కుమార్ గుప్తా, ఎస్పీ రమణకుమార్‌లు ప్రత్యేక దృష్టిసారించారు. డిజిపి, ముఖ్యమంత్రి సైతం కేసును త్వరగా ఛేదించి ప్రజల్లో వున్న భయాందోళనలు తొలగించాలని చెప్పడంతో గాలింపు జరిపి నిందితుడిని పట్టుకొన్నారు. విజయవాడలోని ఓ మందుల షాపులో పని చేసే శ్రీనివాస్ ఈ ఘాతుకానికి పాల్పడినట్లు పోలీసులు గుర్తించారు. విజయవాడలో పని చేస్తున్న ఇతను తడ ఎస్ఐపై కక్షతోనే ఈ హత్యలు చేసినట్లు పోలీసుల ముందు ఒప్పుకొన్నాడట. గతంలో మనుబోలుకు చెందిన ఒక మహిళను వేధిస్తున్న కేసులో అక్కడ ఎస్ఐగా పని చేస్తుండిన శ్రీనివాసరెడ్డి ఇతన్ని అరెస్టు చేసి జైలుకు పంపారు. అప్పటి నుండి ఎస్ఐపై కక్ష పెంచుకొన్నాడు. ఒంగోలులో చెన్నై వెళ్తున్న బస్సు ఎక్కి తడ వద్దకు రాగానే ఒక్కసారిగా రమేష్, అజయ్ బిశ్వాస్, నిరంజన్‌ను పొడిచి చంపి అక్కడ నుంచి పారిపోయాడు. ఈ హత్యలతో ఎస్ఐను సస్పెండ్ చేస్తారని భావించి ఈ హత్యలు చేశానని, వేరే కారణమేమీ లేదని తేల్చి చెప్పినట్లు సమాచారం. సంచలనం కల్గించిన ఈ కేసులో హంతకుడిని పట్టుకొనేందుకు పోలీసులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. ఈ సమయంలో ఎస్ఐ శ్రీనివాస్‌రెడ్డికి వచ్చిన మెసేజ్ ఆధారంగా కూపీ లాగడంతో ఆచూకీ తెలిసింది. అయితే నిందితుడిని పట్టుకొన్నామని, శ్రీనివాస్ అనే ఉద్యోగి తడ వద్ద బస్సులో జరిగిన మూడు హత్యలకు కారణమని పోలీసులు తేల్చి చెప్పడంపై పలు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు ప్రజలు. ఎస్ఐపై కక్షతోనే ఈ హత్యలు చేసినట్లు నిందితుడు చెబుతుండడం, కూరగాయలు కోసే కత్తితో ముగ్గురిని హత్య చేయడం సాధ్యమా అన్న అనుమానాలు తలెత్తుతున్నాయి. మొదట్లో ప్రొఫెషనల్ కిల్లర్ పనిగా, వైద్యశాస్త్రం గురించి అవగాహన వున్న వ్యక్తిగా భావించారు. అయితే కేవలం 10వ తరగతి వరకు చదివిన వ్యక్తే ఈ హత్యలు చేశాడని చెబుతుండడం అనుమానాలకు తావిస్తోంది.



హంతకుడు వేసుకొన్న చొక్కా, వాడిన కత్తి.



వివరాలు వెల్లడిస్తున్న ఎస్పీ రమణకుమార్. వెనుక ముసుగు వ్యక్తినే హంతకుడు.




ఈ రాశివారు చేసే ముఖ్య పనులలో ఆటంకాలేర్పడతాయి. అనుకూలమైన వారం కాదు. నిద్రా సౌఖ్యం తక్కువ. అకాల భోజనం, శరీరారోగ్య లోపం వుండగలదు. వృత్తి, వ్యాపార భాగస్వామ్య ఒప్పందాలు బెడిసికొడతాయి. వాహనం ఉపయోగించు వారికి ప్రయాణాల పట్ల శ్రద్ధ అవసరం. సంతానం విషయంలో శుభవార్తలు వినగలరు. ఇతరులతో మాటలు కలుపునపుడు జాగ్రత్తలు అవసరం.




మనశ్శాంతి అధికం. వృత్తి, వ్యాపార రంగాల వారికి తగు జాగ్రత్తలు అవసరం. కొన్ని ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా వెయ్యాలి. ప్రతి పనిలో జాప్యం ఎక్కువ. కోర్టు వ్యవహారాలపై శ్రద్ధ అవసరం. విద్యార్థులు విజయం సాధిస్తారు. వ్యవసాయదారులు కొంత రుణం చేయవలసి వుంటుంది. కళా, క్రీడా రంగాల వారికి ఆదాయం వున్నా శత్రు, రుణ, రోగసమస్యలు బాధిస్తాయి.




పనులన్నీ సామాన్యంగానే వుంటాయి. కొన్ని విషయాలలో సమస్యలు, శత్రు భయం వుంటుంది. దూర ప్రాంత పనులు అనుకూలించవు. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఇంట్లో కుటుంబ వాతావరణం ఆశాజనకం. ఉద్యోగుల బదిలీ సమస్యలలో మార్పులుంటాయి. సంతాన విషయంలో అనుకోని ఖర్చులుంటాయి. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఈ వారం సమస్యా కాలమే.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలు చేసేవారు అన్ని పనులలో తగు జాగ్రత్తలు తీసుకోవాలి. ఇంట్లో శుభకార్య యత్నాలు వాయిదా వేయడం మంచిది. ముఖ్యమైన ప్రయాణాలు ఆగుట లేదా వాయిదా పడుట జరుగుతుంది. వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. ఈ వారమంతా పరీక్షా కాలమే. విద్యార్థులు కృతనిశ్చయులై విద్యలపై శ్రద్ధ పెట్టవలెను.




ఇంటాబయట సమస్యలు పెరుగుతాయి. ఇతరులకు చేసే సహాయ వాగ్దానాలు తగ్గించాలి. వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాల వారికి ఆర్థిక సమస్యలుంటాయి. కొన్ని చెడు సంఘటనలు ఎదుర్కోగలరు. అకారణ విరోధాలు, శత్రువులు ఏర్పడగలరు. విద్యార్థులు ఇతర విషయాలపై శ్రద్ధ చూపి సమయం వృథా చేస్తారు. రాజకీయులు పై, క్రింది వర్గాలతో సమయస్ఫూర్తిగా వ్యవహరించాలి.




శ్రమతో పనులు పూర్తి చేస్తారు. స్పెక్యులేషన్ లాభించదు. ఆర్థికాదాయాలు తగ్గుతాయి. వృత్తి, వ్యాపారాలలోని వారిని ముఖ్యవ్యక్తులు నమ్మక ద్రోహం చేస్తారు. వ్యయప్రయాసలతో ఆదాయం పెరుగుతుంది. కొంతవరకు రుణ సమస్యలు తీరుతాయి. ప్రయాణాలు అనుకూలిస్తాయి. వ్యవసాయదారులు పనులకై అధిక వ్యయం చేస్తారు. కళా, క్రీడా రంగాలలోనివారు కొత్త ప్రయత్నాలు చేయవద్దు.

# వారఫలాలు

తేది 25-08-2012 నుండి 31-08-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; మిథునంలో శుక్రుడు; 27తేది వరకు కర్కాటకంలో బుధుడు తదుపరి సింహంలో; సింహంలో రవి; తులలో కుజ, శనులు; వృశ్చికంలో రాహువు; తుల, వృశ్చిక, ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు సంచరిస్తారు.

## పంచాంగం

27తేది సుభద్ర ఏకాదశి.
29తేది ఓనం పండగ.

### శుభ ముహూర్తాలు

అధిక భాద్రపదమాసం శూన్యమాసం కావడంతో వివాహాది శుభకార్యాలకు ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు
### అధిక భాద్రపద శుక్ల

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25 | శని | అష్టమి | ఉ | 06.19 | గం.ల.వ |
| 26 | ఆది | దశమి | రా | 02.18 | గం.ల.వ |
| 27 | సోమ | ఏకాదశి | రా | 12.27 | గం.ల.వ |
| 28 | మంగళ | ద్వాదశి | రా | 10.45 | గం.ల.వ |
| 29 | బుధ | త్రయోదశి | రా | 12.27 | గం.ల.వ |
| 30 | గురు | చతుర్దశి | రా | 08.08 | గం.ల.వ |
| 31 | శుక్ర | పౌర్ణమి | సా | 07.26 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




ఇతరులతో మిత్ర శత్రుత్వాలు పాటించి మసలు కోవాలి. వృత్తి, వ్యాపార రంగాల వారికి విజయావకాశాలున్నాయి. స్పెక్యులేషన్‌కు దూరంగా వుండాలి. ప్రయాణాలలో అప్రమత్తతతో మెలగాలి. తలపెట్టిన పనులు ఆలస్యంగా పూర్తవడం లేదా ప్రతిబంధకాలు ఏర్పడతాయి. విద్యార్థులు ఇతరులతో స్నేహం చేసేటప్పుడు జాగ్రత్తలు పాటించాలి. వ్యవసాయదారులకు ఇది పరీక్షా సమయం.




ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. ఉద్యోగులు శక్తికి మించిన కార్యాలలో తలదూర్చరాదు. ఈ రాశివారు మిత్ర, శత్రుత్వాలను చూసి మసలుకోవాలి. వృత్తి, వ్యాపారాల వారికి అనవసర వ్యయం వుంటుంది. వ్యవసాయ రంగంలోనివారు రుణాన్వేషణలో వుంటారు. కళా, క్రీడా రంగాల వారు చేసే పనులలో ఫలితం ఆలస్యంగా పొందుతారు. రాజకీయులకు శ్రమకు తగ్గ ఫలితం వుండదు.




తలపెట్టిన కార్యాలలో ఆటంకాలు, శత్రువులధికమవుతారు. వృత్తి, వ్యాపార రంగాలలో ఆర్థికాదాయం బాగుంటుంది. శ్రమకు తగ్గ ఫలితం వుంటుంది. స్పెక్యులేషన్ లాభించదు. ఇంట్లో తలపెట్టిన శుభకార్యాలకు శుభసంకేతాలు ఆలస్యంగా అందుతాయి. విద్యార్థులు తమ ఆలోచనలకు పదును పెట్టాలి. వ్యవసాయ పనులు సామాన్యంగా వుంటాయి. రాజకీయులకు ఇది ప్రతికూలమైన వారం.




చేసే పనులలో వ్యతిరేకతలుంటాయి. వ్యక్తిగత విమర్శలెదుర్కోవాలి. శత్రు భయం కల్గుతుంది. వ్యక్తిగత ఆకర్షణలు తగ్గుతాయి. వృత్తి, వ్యాపారాలు పనులలో నత్తనడక సాగి స్వల్ప సమస్యలుంటాయి. ఇతరులతో అనవసర జోక్యం, వివాదాలకు పోవద్దు. కళా, క్రీడా రంగాల వారికి వృత్తిపరమైన సమస్యలు, ఆర్థిక బాధలుంటాయి. రాజకీయులు అనవసర విషయాలలో జోక్యం చేసుకోవద్దు.




వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయం బాగుంటుంది. చేసే అన్ని పనులు నెరవేరుతాయి. క్రమంగా మనశ్శాంతి లభిస్తుంది. నూతన గృహ నిర్మాణాది పనులు ప్రారంభిస్తారు. ఉద్యోగులు పై అధికారులను అనుసరించడం మంచిది. విద్యార్థులకు మంచి అనుకూల సమయం. వ్యవసాయదారులకు కృషికి తగిన ఫలితం లభిస్తుంది. రాజకీయాలలోని వారు నిరాశ, నిస్పృహలున్నప్పటికీ ధైర్యంగా వుండాలి.




తలపెట్టిన పనులలో గతంలో ఏర్పడిన ఆటంకాలు తొలగి, సానుకూలమౌతాయి. ప్రయాణాలలో జాగ్రత్తలు పాటించాలి. శుభ వాతావరణంలో మానసిక ప్రశాంతత లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలంగా వుంటాయి. వ్యవసాయ రంగంలోని వారు అనవసర రుణాలు చేయవలసి వుంటుంది. కళా, క్రీడా రంగాల లోని వారు వృత్తిపరమైన విమర్శలెదుర్కొంటారు.

# తూర్పు దోషాలు యజమానులకు శాపాలు!

బి.రత్నప్రసాద్ — కావలి

* తూర్పు గృహం లోపాలు ఏ విధంగా ప్రభావాల్ని చూపిస్తాయి?

తూర్పు 'ఇంద్రస్థానం'. అధిపతి సూర్యుడు. పురుష గ్రహం. అందువల్ల ఇందులోని లోపాలు మగవారిపై దుష్ప్రభావాలు చూపిస్తాయి.

సి.సుజాతమ్మ — బుచ్చి

* యంత్రాన్ని గోడ లోపల పూడ్చవచ్చునా?

మత్స్య యంత్రాన్నయినాసరే గోడలోగానీ, భూమిలోగానీ పూడ్చరాదు. దేవుడి గదిలో మాత్రమే ప్రతిష్టించాలి.

పి.వసంతరావు శాస్త్రి — బుచ్చి

* తండ్రి మరణించాక గృహ నిర్మాణం ఎప్పుడు చేయాలి?

ఆబ్దికం, సంవత్సరీకం తర్వాత కర్మక్రియలు పూర్తిచేశాక గృహ నిర్మాణం ప్రారంభించవచ్చు.

ఎం.ఫరీదా అహ్మద్ — హైదరాబాద్

* అపార్టుమెంటులో ఆగ్నేయం, ఈశాన్యం పడగ్గదులున్నాయా? ఫలితాలు చెప్పండి?

ఆగ్నేయం పడగ్గది పతులకు కలహం, ఈశాన్యం గది వ్యాధి అని కశ్యపవాస్తు చెబుతోంది.

సి.సుజాత — కర్నూలు

* తులసి దళాన్ని శుక్రవారం కోయకూడదంటారు. ఎందువల్ల?

తీర్థంలో వాడకానికి ఒకటి రెండు దళాలు ఉదయం నుంచి సాయంత్రంలోగా కోసుకొనవచ్చు. ఎక్కువగానూ, అదేపనిగానూ కోయకూడదన్నది శాస్త్రార్థం.

ఇ.జగన్నాథరెడ్డి — హైదరాబాద్

* ఇంటి వాస్తు బాగున్నప్పటికీ చుట్టు ప్రక్కల ప్రభావాలుంటాయా?

తప్పక ఉంటాయి. దృష్టి, కోణవేధలు, వీధుల దృక్కోణాలు అనేక ప్రభావాల్ని చూపిస్తాయి. బాహ్య, అంతర స్థితుల పట్ల గృహస్తు జాగ్రత్తగా ఉండటం అవసరం.

టి.వి.రెడ్డి — సూళ్లూరుపేట

* పశ్చిమ వాయువ్యం వీధిపోటు ఉన్నా ఆ యింట్లో పురుషులు అభివృద్ధి చెందారు.

మీరు చెప్పినట్లు అది వీధిపోటుగాక వీధి చూపు అవుతుంది. చూపు మంచిదని శాస్త్రం చెప్పినా, మా అనుభవాల్ని బట్టి 'చూపులు' కూడా 'దృష్టి' వేధోకారకాలు.

డి.వి.అగ్నివేశ్ — చెన్నై

* ఎదురు ప్లాటు ఖాళీగా ఉంది. దానివల్ల మాకేదైనా ప్రమాదమా?

సలక్షణమైన మీ గృహానికి ఎదురుగా శిథిల గృహంతోబాటు, కంప చెట్లతో ఉన్న ప్లాటు ప్రభావాల్ని కలిగించడం నిజమే. అందువల్ల నిర్ణీత యంత్రాన్ని ప్రతిష్టించుకొని, ఆ దుష్ప్రభావాల నుండి మీ గృహాన్ని కాపాడుకోండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

వై.సుబ్బానాయుడు — ఆత్మకూరు

* ఇంటిలో ఏదో ఒక సమస్య. ఎవ్వరికీ మనఃశాంతి లేదు.

వాయువ్యం సెప్టిక్ ట్యాంకు వల్ల అగాధమయింది. అందువల్ల ఇంట్లో మానసిక వత్తిడులు ఎక్కువ. దాన్ని వెంటనే తొలగించండి.

కె.రఘురామ్ — ఆత్మకూరు

* ప్రాచీన కాలంలో 'ఝాము' అంటుంటారు. శాస్త్రీయ విశ్లేషణ చెప్పండి?

ఝాముకు సమయం మూడు గంటలు. ప్రాచీన సమయసూచి 7 1/3 ఘడియలు. ఘడియకు ఆరు విఘడియలు.

పి.సూర్యం — విజయవాడ

* అన్ని అంశాలలోనూ గృహస్తులు క్షేమంగా ఉండాలంటే ఏం చేయాలి?

అవాస్తు దోషాల్ని సరిచేసుకొని, యంత్ర ప్రతిష్ట చేసుకోవడమే ఉత్తమ పరిష్కారం.

సి.విష్ణువర్ధనరావు — సికింద్రాబాద్

* ప్లాటులో ఈశాన్యపు గది ఉన్నది. దాన్నెలా ఉపయోగించుకోవాలి?

ఈశాన్యపు గదిలో పూజా గృహంతోపాటు పిల్లలు చదువుకోవచ్చు. పడగ్గదిగా పనికిరాదు.

సి.వసంతకుమార్‌రెడ్డి — నెల్లూరు

* ప్లాటులో ఆగ్నేయం పడగ్గది మంచిదేనా?

ఆగ్నేయం పడగ్గది దంపతుల మధ్య కలహాల్ని సృష్టిస్తుంది. నైరుతి వంట గదిని ఆగ్నేయానికి మార్చి, నైరుతిలో 'బెడ్' ఏర్పాటు చేసుకోండి.

# ఉత్తమ అధికారుల ఎంపికపై పారదర్శకత ఏది?

**వివిధ ప్రభుత్వ శాఖల్లో పనిచేసే ఉద్యోగులకు ఉత్తమ సేవలకుగాను ఆగష్టు 15వ తేది ఇచ్చే సేవా పురస్కారాలు వివాదాస్పదం అవుతున్నాయి. పరిమితంగా ఇవ్వాల్సిన వీటిని వందల సంఖ్యలో అర్హతలేని వారికి ఇవ్వడం విమర్శలకు దారితీస్తుంది.**

స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్ దినోత్సవాల సందర్భంగా వివిధ ప్రభుత్వ శాఖల్లో ఉత్తమ సేవలు అందించిన వారికి అవార్డులు ప్రదానం చేయడం ఆనవాయితీ. అయితే రాను రాను ఈ అవార్డుల ప్రదానం కార్యక్రమం ప్రక్కదారి పడుతుంది. జిల్లాలో 70 ప్రభుత్వ శాఖలు ఉన్నాయి. ఈ శాఖల్లో విధి నిర్వహణ పట్ల అంకిత భావంగల వారిని, ప్రజలకు సేవలు అందించిన వారిని ముందుగా గుర్తించి అవార్డు ఎంపికకు సిఫార్సు చేస్తుంటారు ఆ శాఖాధిపతి. పది సంవత్సరాల క్రితం అవార్డు అందుకునే వారిని వేళ్లపై లెక్క పెట్టేవారు. ప్రస్తుతం అవార్డులు అందుకుంటున్న వారి జాబితా కొండవీటి చాంతాడంత ఉంది. అవార్డు ఎంపికకు ఎటువంటి పారదర్శకత లేకపోవడం ఇందుకు కారణంగా చెబుతున్నారు. అర్హులకు బదులు అనర్హులనే ఎక్కువగా ఎంపిక చేస్తున్నారన్న ప్రచారం ప్రభుత్వ కార్యాలయాల్లో జరుగుతోంది.

రాజకీయ నేతల సిఫార్సులు, యూనియన్ నాయకులు పైరవీలు చేసి అధికారులపై ఒత్తిడి తెచ్చి తమకు సంబంధించిన వారి పేర్లను ఎంపిక జాబితాలో చేర్పించేస్తుంటారు. ఒక్కో శాఖ నుంచి ఇద్దరు చొప్పున ఎంపిక చేసినా దాదాపు 150 మందికి అవార్డులు ప్రదానం చేయాల్సి ఉంటుంది. అలా కాకుండా ఒక శాఖ నుంచి ఐదుగురికి మించి ఎంపిక చేస్తున్నారు. మొన్న జరిగిన 66వ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలలో దాదాపు 200 మందికి పైగా అవార్డులను అందించడం జరిగింది. ఎంపిక చేసిన వారిలో ఇప్పటికే పదిసార్లకు పైగా అవార్డులు అందుకున్న వారే ఎక్కువగా ఉన్నారు. స్వాతంత్ర్య దినోత్సవం, రిపబ్లిక్‌డే వేడుకల్లో ఒకసారి అవార్డు ప్రదానం చేస్తే మరోసారి వీరికి అవకాశం ఇవ్వకూడదు. కొత్తవారికి అవకాశం కల్పిస్తే మరింత ఉత్సాహంతో విధులు నిర్వహించే అవకాశం ఉంటుంది. అలా కాకుండా ఇచ్చిన వారికే మళ్లీ అవార్డులు అందించడం చర్చనీయాంశంగా మారింది.

ప్రభుత్వ శాఖల నుంచి అవార్డుల కోసం వచ్చిన జాబితాను జిల్లా కలెక్టరేట్ అధికారులు పరిశీలన చేసి అర్హులను మాత్రమే గుర్తించాల్సి ఉంటుంది. చివరి క్షణంలో రాజకీయ నేతల సిఫార్సుతో వచ్చిన పేర్లను సైతం జాబితాలో పొందుపరుస్తున్నారన్న ఆరోపణలు ఉన్నాయి. కలెక్టరేట్ పరిపాలనాధికారి, జిల్లా రెవిన్యూ అధికారి పర్యవేక్షణలో తుది జాబితాను రూపొందించి కలెక్టర్ ఆమోదం కోసం పంపుతుంటారు. జాబితాలో ఉన్న పేర్లపై జిల్లా కలెక్టర్‌కు అవగాహన లేకపోవడంతో సంతకం చేస్తుంటాడు. ఆమోదం పొందిన జాబితాను పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో వెల్లడించడంతో అవార్డులు అందుకున్న వారి పేర్లు విని మిగిలిన ఉద్యోగులు విస్తుపోవాల్సి వచ్చింది. ఎంపిక విధానం అవలంభిస్తున్న తీరుపై ప్రతి సంవత్సరం అధికారులు విమర్శలపాలవుతున్నారు. ఎన్ని విమర్శలు, ఆరోపణలు వస్తున్నా ఏమాత్రం పట్టించుకోకుండా వారు అనుకున్న వారికి జాబితాలో చోటు కల్పిస్తుండడం విశేషం.

## జిల్లాస్థాయి అధికారికి అవార్డా?

క్రిందిస్థాయి ఉద్యోగులు అంకితభావంతో పని చేయాలన్న సంకల్పంతో ప్రశంసాపత్రాలు ఉన్నతాధికారులు అందిస్తుండడం సహజం. జిల్లాస్థాయి అధికారుల సేవలను ప్రభుత్వం గుర్తిస్తే అటువంటి వారికి రాష్ట్రస్థాయిలో సిఎం, గవర్నర్ చేతుల మీదుగా అవార్డులు ప్రదానం చేస్తారు. ఈ దఫా జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతంకు స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రశంసాపత్రం అందించడం ఆశ్చర్యం కలిగించింది. జిల్లా స్థాయిలో వివిధ శాఖల పనితీరును పర్యవేక్షించే అధికారిని అవార్డుకు ఎంపిక చేయడంపై అధికారుల పనితీరు ఏవిధంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. ఈ అధికారితోపాటు నెల్లూరు ఆర్డీఓ మాధవీలతకు కూడా ఉత్తమ సేవలు అందించినందుకు పోలీసు పెరేడ్ గ్రౌండ్‌లో ప్రశంసాపత్రం అందించడం కొసమెరుపు.

అవార్డుల ప్రదానోత్సవానికి సంబంధించి జిల్లా కలెక్టర్ సరైన దృష్టి సారించకపోవడంతో విధి నిర్వహణలో అంకితభావంతోనూ, నిజాయితీగా పని చేసిన వారికి చోటు దక్కలేదన్న ప్రచారం జరుగుతోంది. ఈ వ్యవహారం మరోసారి విమర్శల పాలు కాకుండా పారదర్శకతతో వ్యవహరించాల్సిన అవసరం ఉంది.

---

ఎప్పటికయ్యేనో?

# నత్తనడకన జలయజ్ఞం పనులు!

**జిల్లాలో 900 కోట్ల రూపాయలు వెచ్చించి చేస్తున్న జలయజ్ఞం పనులు నత్తనడకన చేస్తున్నారు. నెల్లూరు, సంగం బ్యారేజీలు, కృష్ణపట్నం కాలువ లైనింగ్ పనులు, ఈదూరు – కోడూరు చెరువు మరమ్మత్తు పనులు దీనికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు.**

జిల్లాలో జలయజ్ఞం పేరుతో చేపట్టిన నీటిపారుదల కాల్వల లైనింగ్ పనులు నత్తనడకన జరుగుతున్నాయి. రెండు సంవత్సరాల క్రితం కాల్వల లైనింగ్ మరమ్మత్తుల పనులకు సంబంధించి టెండర్లు పిలిచి పనులు అప్పగించడం జరిగింది. పనులు ప్రారంభించి మధ్యలో నిలిపి వేయడంతో సాగునీరు విడుదల చేసేందుకు ఆటంకంగా మారింది. దీంతో ఆయకట్టు రైతులు వరిపంటను వేసుకోలేక పోయారు. కాల్వల లైనింగ్ పనులు నిర్ణీత సమయంలోగా పూర్తి చేసి రైతులకు సాగునీరందించాలన్న లక్ష్యం నెరవేరకుండా పోయింది. స్థానిక ఎమ్మెల్యేలు సైతం ఈ పనులపై ప్రత్యేకదృష్టి సారించక పోవడంతో పనులు దక్కించుకొన్న కాంట్రాక్టర్లు వివిధ కారణాలు చూపుతూ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. పలు దఫాలు రైతు సంఘం నేతలు జిల్లా ఉన్నతాధికారులను కలిసి సాగునీటి కాల్వల లైనింగ్, మరమ్మత్తు పనులు త్వరితగతిన పూర్తి చేయాలని విజ్ఞప్తి చేసినా పట్టించుకొనేవారు లేకుండాపోయారు.

జిల్లావ్యాప్తంగా దాదాపు 900 కోట్ల రూపాయలతో జలయజ్ఞం పనులు చేపట్టారు. వాటిలో ప్రధానంగా సాగునీటి కాల్వల పనులను కూడా చేర్చారు. ఈదూరు – కోడూరు చెరువులకు మరమ్మత్తులు, కాల్వ లైనింగ్ పనులు పూర్తి చేసేందుకు దాదాపు 6కోట్లు కేటాయించింది ప్రభుత్వం. నిధులు చాలవన్న సాకుతో సదరు కాంట్రాక్టర్ పనులు నిలిపివేశాడన్న ఆరోపణలు వున్నాయి. ప్రస్తుతం పెరిగిన ధరలకు అనుగుణంగా నీటిపారుదల శాఖ అధికారులు ప్రభుత్వానికి అంచనాలను పంపి మరికొన్ని నిధులు కేటాయించేవిధంగా కృషి చేశారు. ప్రస్తుతం ఈ కాలువకు లైనింగ్ పనులు జరుగుతున్నాయి. ఈ పనులు ఖరీఫ్ సీజన్‌లో పూర్తి చేసే అవకాశం కన్పించడం లేదు. అలాగే సర్వేపల్లి, కృష్ణపట్నం కాలువ, ఈదగాలి, వల్లూరు కాలువ లైనింగ్ పనులు కొంత మేర జరిగాయి. ఈ పనులు దక్కించుకున్న జిఎస్ఆర్ కంపెనీ ప్రతినిధులు గతవారం రోజుల నుంచి తిరిగి పనులు ప్రారంభించారు.

## నాసిరకంగా లైనింగ్ పనులు

కృష్ణపట్నం కాలువకు జరుగుతున్న లైనింగ్ పనులు నాసిరకంగా చేస్తున్నారు. లైనింగ్ కోసం ఉపయోగించే బ్లూమెటల్ చిప్స్‌లో ఎక్కువ భాగం నాసిరకంగా వుంటోంది. ఇందులో ఇసుకకు బదులు కొంత మేర మట్టిని కలుపుతున్నారు. మొత్తం మిక్సింగ్ చేసి కాలువకు ఇరువైపుల అంచులకు లైనింగ్ వేస్తున్నారు. నాసిరకం మెటీరియల్‌తో లైనింగ్ పనులు చేస్తే కాలువ నీటి మట్టం పెరిగిన సమయంలో ఉధృతికి తట్టుకోలేక కొట్టుక పోయే ప్రమాదం వుంది. నీటి పారుదల శాఖ ఇంజనీర్ల పర్యవేక్షణలో లైనింగ్ పనులు చేపట్టాల్సి వుండగా ఇక్కడ వారి పర్యవేక్షణ నామమాత్రమేనని చెప్పవచ్చు. మొత్తం పనులను కాంట్రాక్టర్‌కు సంబంధించినవారే చేస్తున్నారు.

పై రెండు కాలువ పనులు ఏవిధంగా జరుగుతున్నాయో ఉదాహరణకు మాత్రమే. అన్నీ ప్యాకేజీలలో ఇదేవిధంగా చేస్తున్నారు. జలయజ్ఞంలో సంగం బ్యారేజి, నెల్లూరు బ్యారేజి పనులు ప్రారంభించి మూడు సంవత్సరాలు గడచింది. అయినా కూడా వీటిని పూర్తి చేయలేక ప్రతి సంవత్సరం మరింత గడువును పొడిగిస్తున్నారు. సంగం బ్యారేజి నిర్మాణానికి రూ.122 కోట్లు కేటాయించగా కేవలం 13.5 కోట్లు ఖర్చు చేయగలిగారు. నెల్లూరు బ్యారేజి నిర్మాణానికి రూ.126.7 కోట్లు కేటాయించగా ఇందులో 43కోట్లు ఖర్చు చేసినట్లు రికార్డుల్లో నమోదు చేశారు. ఈ పనులు పూర్తి చేసేందుకు మరో 30 నెలలు గడువు పొడిగించింది ప్రభుత్వం.

సంగం, నెల్లూరు బ్యారేజి నిర్మాణ పనులకు నిధుల కొరత తీవ్రంగా వున్నట్లు కాంట్రాక్టు పొందిన సంస్థ ప్రతినిధులు చెబుతున్నారు. చేసిన పనులకు సకాలంలో నిధులు చెల్లిస్తే పనులు పూర్తి చేసేందుకు వీలుంటుందని అంటున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం స్పందించి జలయజ్ఞం పేరుతో జిల్లాలో చేపట్టిన సాగునీటి ప్రాజెక్టులు, కాల్వల లైనింగ్ పనులకు నిధులు కేటాయించాల్సిన అవసరం వుంది.




✍ అల్లూరు రహీం

పిచ్చి ముదిరింది రోకలి తలకు చుట్టమన్నాడట వెనుకటికొకడు. బిజినెస్‌మెన్ వంటి సూపర్ డూపర్ హిట్ సినిమా తీసిన దర్శకుడు పూరి జగన్నాథ్‌కు పైత్యం హెచ్చి దేవుడు చేసిన మనుషులు చిత్రం తీసినట్లుంది. ఈ చిత్రంలో కథ అసలు లేదు. కానీ తానేమి తీసినా జనం చూస్తారన్న పొగరు బోతుతనంతో పూరీ ఈ సినిమా రీళ్లు చుట్టేశాడు. ప్రథమార్థంలో చెప్పే 'తొక్క'లో కథ (తెరమీద ధైర్యంగా చూపించాడు మరీ), ద్వితీయార్థంలోనూ మరో తొక్కతీసి ఇంకోరకంగా చూపించి జనం తలలు పగులగొట్టేశాడు. దీనివల్లే సినిమా ముగియకమునుపే ఇలియానా దేవుడా.. దేవుడా అనే చరణంతో వచ్చే పాటకు వెండితెరపై నర్తిస్తున్నా జనం హాలు బయటకు పరుగెడతారు. ఈ రెండు ఎపిసోడ్లు చాలవని వైకుంఠం ఎసిసోడ్ ఒకటి అల్లాడు. శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి పాత్రలను కామెడీ నటుల చేత వేయించి జనాన్ని నవ్వించాలన్న ప్రయత్నం చేశాడు. హీరో రవితేజ చాలా ఏళ్లుగా ఒకే తరహా పాత్రల పోషణతో ప్రేక్షకులను సాధిస్తున్నాడు. పూరీ జగన్నాథ్ రవితేజతో తీసిన ఆరవ చిత్రం దేవుడు చేసిన మనుషుల్లోనూ దాన్ని కొనసాగించాడు.

ఈ చిత్రంలో పాటలు, కొన్ని మంచి మాటలు, థాయ్‌లాండ్ అందాలను బ్రహ్మాండంగా చూపించిన శ్యామ్. కె. నాయుడు ఫోటోగ్రఫీ లేకుంటే ఐదు నిమిషాలపాటు కూడా ఈ సినిమాను చూడలేం. రఘు కుంచె సంగీతం కూర్చిన ఏమి సేతురాస్వామి, డిస్టబ్ చేస్తున్నాడు, సుబ్బలక్ష్మి చరణాలతో సాగే పాటలు బాగున్నాయి. పూరీ జగన్నాథ్‌నే మాటలు వ్రాసిన ఈ సినిమాలో ఎవరి పబ్లిసిటీ వారే చేసుకోవాలి. ఆడవాళ్లు ఇష్టం లేని మొగుళ్లతో కాపురం చేస్తారు. దరిద్ర దేవత లక్ష్మీదేవి కంటే పవర్‌పుల్; బిల్‌గేట్స్, బరాక్ ఒబామా ఎప్పుడైనా లక్ష్మీదేవిని పూజించారా? వంటి డైలాగులు ఆలోచింపజేస్తాయి. లక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకోను అలీ చేసే గిమ్మిక్కులు సనాతనవాదులకు కోపం తెప్పిస్తాయి. చిత్రంలో విలన్ షార్టుసర్క్యూట్ ఇన్ బ్రెయిన్ వ్యాధితో బాధపడుతూ చేసే అతి ప్రేలాపనలు తెలుగు ప్రేక్షకులు చూడలేరని పూరి జగన్నాథ్ ఇప్పటికే తెలుసుకొని వుంటాడు. హీరోయిన్ ఇలియానా ఈ మధ్య 'జీరో' సైజ్ అందాల కోసం కాబోలు చేస్తున్న ప్రయత్నాల్లో భాగంగా ఆమె ముఖంలో కళా, కాంతి రెండు లేకుండా పోయాయి. తెలుగు మాటను కిండల్‌గా పలికే కోవైసరళ చేత కాస్త సంస్కృత పదబంధం వుండే మాటలు పలికించి దర్శకుడు పెద్ద సాహసం చేశాడనక చెప్పక తప్పదు.

చిత్ర సమీక్ష

చిత్ర కథలోనికి వెళ్తే అక్షయ తృతీయనాడు వైకుంఠానికి వెళ్లే నారదుడు (జూనియర్ రేలంగి), శ్రీమహావిష్ణువు (బ్రహ్మానందం), లక్ష్మీదేవి (కోవైసరళ) మధ్య కలహం సృష్టిస్తాడు. లక్ష్మీదేవి వినోదం కోసం శ్రీమహావిష్ణువు ఒక కథ చెప్పనారంభిస్తాడు. హైదరాబాద్‌లో ఎవరూ లేని అనాథ (రవితేజ). థాయ్‌లాండ్‌లో ఇదే స్థితిలో బతుకుతుంటుంది ఇలియానా (ఇలియానా). వీరిద్దరూ పెరిగి పెద్దయ్యాక రవితేజ సెటిల్‌మెంట్లు చేసే రౌడీగా మారగా, ఇలియానా స్వంతంగా టాక్సీ నడుపుతుంటుంది. థాయ్‌లాండ్‌లో మాఫియా నాయకుడు ప్రకాష్‌రాజ్ (ప్రకాష్‌రాజ్) అనుచరుడు శాండిని జూబ్లీహిల్స్ సిఐ సుబ్బరాజు (సుబ్బరాజు) ఎన్‌కౌంటర్ చేస్తాడు. దీంతో ప్రకాష్‌రాజ్ గ్యాంగ్ సుబ్బరాజు వెనుక పడుతుంది. ప్రకాష్‌రాజ్ గ్యాంగ్‌తో మధ్యవర్తిత్వం నడపను సుబ్బరాజు రవితేజను థాయ్‌లాండ్ పంపుతాడు. అక్కడకు వెళ్లిన రవితేజకు ఇలియానా కనపడుతుంది. ఇద్దరు అనాథల మధ్య కాస్త కెమిస్ట్రీ జరిగాక ప్రేమ పుడుతుంది. ప్రకాష్‌రాజ్ సైతం అనాథ అయిన గ్యాంగ్‌స్టర్. షార్ట్ సర్క్యూట్ ఇన్ బ్రెయిన్ వ్యాధితో బాధపడుతూనే సెటిల్‌మెంట్లు చేస్తుంటాడు. పిచ్చి ఎత్తుగడల మధ్య ముగ్గురు అనాథలు రవితేజ, ఇలియానా, ప్రకాష్‌రాజ్‌ల మధ్య వైరం బదులు కొత్త అనురాగబంధం పుట్టడంతో సినిమా ముగుస్తుంది. లేని తలనొప్పిని తెచ్చుకోవాలంటే దేవుడు చేసిన మనుషులు చిత్రంకు వెళ్లొచ్చు.



## అతని కోసం అన్వేషణ!

నువ్వా నేనా, లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ చిత్రాల్లో నటించిన హీరోయిన్ శ్రియకు తెలుగు చిత్రాల్లో అవకాశాలు అంతంత మాత్రంగానే వున్నాయి. ఆమె పెళ్లి చేసుకొనే ఆలోచనలో వున్నట్లు వార్తలు వినిపిస్తున్నాయి. ఇదే విషయాన్ని ఆమెను అడిగితే ప్రేమించడానికి ఓ మంచి మనిషి కోసం అన్వేషిస్తున్నాను. డేటింగ్, ప్రేమ వంటి బంధాలు నా మనస్తత్వానికి సరితూగవు. ఒకర్ని చూడగానే వారి మనస్తత్వాన్ని అంచనా వేసే విద్య నాకింకా అబ్బ లేదు. ఓ సినిమా మొదలవ్వగానే అందులో నటించే సహనటులపై ప్రేమ, మమకారం పెరుగుతుంటాయి. ఇవన్నీ మామూలే. సినిమా పూర్తయ్యాక ఎవరికి ఎవరమో? శాశ్వతంగా ముడిపడే ఓ బంధం కావాలి. ఎవరైనా అదే కోరుకుంటారు. నన్ను నేనుగా ప్రేమించే మనసు కావాలి. వాళ్లు సినిమా వాళ్లు కాకపోయినా పర్వాలేదంటుంది శ్రియ.

## కన్నడానికి జగపతిబాబు



హీరో జగపతిబాబు ద్విభాషా చిత్రాలపై దృష్టి సారించారు. ఈ మధ్యనే తమిళంలో విక్రమ్‌తో కలసి శివతాండవంలో నటించారు. ఈ క్రమంలోనే ఆయన కన్నడంలో 'బచ్చన్' చిత్రంలో నటించను గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. ఈగ ఫేం సుదీప్ హీరోగా నటించే ఈ చిత్రానికి శశాంక్ దర్శకుడు. తెలుగులో 'ఏప్రెల్‌ఫూల్' చిత్రంలో ప్రస్తుతం నటిస్తున్నారాయన.



## హీరోయిన్లకే హీరోయిన్!

హిందీ, తమిళ, కన్నడ, బెంగాలీ చిత్రాల్లో సమీరా రెడ్డి ఐటమ్‌గాళ్‌గా బిజీగా వుంది. ఇటీవల హైదరాబాద్ వచ్చిన ఆమె పిచ్చాపాటీగా మాట్లాడుతూ నేను ఎన్నో భాషల్లో నటించాను. కానీ నాకు తమిళ ప్రేక్షకులతోనే అనుబంధం ఎక్కువ. ఈ యేడాది వైవిధ్యభరిత చిత్రాల్లో నటిస్తున్నా. మా హీరోయిన్లకు ప్రత్యేక హోదా కల్పించిన నటి విద్యాబాలన్. ఆమెను ఆదర్శంగా తీసుకోవడం వల్లే కథానాయికగా ప్రాధాన్యం వున్న చిత్రాల్లో ధైర్యంగా నటించగలుగుతున్నాం. నేను సైతం డర్టీపిక్చర్స్, కహాని తరహా చిత్రాల్లో నటిస్తానంటుందామె.

## సాగర సంగమం తీయలేను!



దర్శకుడు కె.విశ్వనాథ్ సాగరసంగమం చిత్రాన్ని ఎంతో గొప్పగా తీశారు. ఈ సినిమా మళ్లీ రీమేక్ చేస్తే తాను నటిస్తానన్న ఆకాంక్షను ఎన్టీఆర్ వ్యక్తం చేశాడు. ఈ మాటే విశ్వనాథ్ దగ్గర ప్రస్తావిస్తే సమాధానంగా ప్రతి కథకీ ఓ ఆత్మ వుంటుంది. మరోసారి తెరకెక్కించే సందర్భంలో అది రాకపోవచ్చు. అందుకే ఈ చిత్రాన్ని రీమేక్ చేసుకొనే ఆలోచన చేయడం లేదని తేల్చి చెప్పేశారు.



## ప్రతిభతోనే అవకాశాలు

హీరోయిన్ తమన్నా అంటే కేరాఫ్ చెన్నై అనేవారు. ఇప్పుడామె హైదరాబాద్‌లోనే వుంటుంది. రెబల్, కెమెరామెన్ గంగతో రాంబాబు చిత్రాలు చేస్తుంది. అప్పుడప్పుడు హిందీ చిత్రం షూటింగ్‌కు ముంబాయి వెళ్తుంది. ఇటీవల చెన్నైలో జరిగిన ధనుష్ పుట్టిన రోజు వేడుకల్లో హడావుడి చేసిన ఆమెను మళ్లీ తమిళ ప్రయత్నాలా అంటే; మనం అవకాశాల కోసం ప్రయత్నిస్తేనో, సిఫార్సులు చేయించుకొంటేనే రావు, మన ప్రతిభ ఆధారంగానే వస్తాయి. ధనుష్ కుటుంబంతో వున్న అనుబంధంతోనే ఆ వేడుకల్లో పాల్గొన్నానంది.

# ట్రాఫిక్ పోలీసుల మామూళ్ల దందా!

**● వీరు మారరు**

జిల్లా ఎస్పీ రమణకుమార్ ట్రాఫిక్‌ను క్రమబద్ధీకరించేందుకు, నేరాల నియంత్రణకు ఎన్ని చర్యలు చేపడుతున్నా క్రింది స్థాయి సిబ్బందిలో మార్పు రాకపోవడంతో అవన్నీ నిష్ప్రయోజనమవుతున్నాయి. ఎక్కడికక్కడ ట్రాఫిక్, లా అండ్ ఆర్డర్ సిబ్బందిని నియమించి ట్రాఫిక్ కంట్రోల్ చేసేందుకు ప్రయత్నిస్తున్నా కొందరు అవినీతిపరులైన సిబ్బంది మూలంగా అది గాడిలో పడడం లేదు. ఆటోలను నియంత్రించాల్సిన పోలీసులు తమకు లంచాలు ఇచ్చే వారిని వదిలేస్తూ, ఇవ్వని వారిపై కేసులు పెడుతుండడం విమర్శల పాలవుతుంది. ఆత్మకూరు బస్టాండు వద్ద ఉత్తరంవైపు ఆటోలు దీనికి ఉదాహరణ. ఈ ప్రాంతం నుంచి అధిక సంఖ్యలో ఆటోలు కోవూరు, బుచ్చి తదితర ప్రాంతాలకు ప్రయాణీకులను ఎక్కించుకొని రాకపోకలు సాగిస్తుంటాయి. టాటా మ్యాజిక్ ఆటోలతోపాటు, చిన్న ఆటోలు ఈ ప్రాంతాల నడుమ తిరుగుతుంటాయి. ఈ వాహనాల రాకపోకల విషయంలో పోలీసులు కీలకంగా వ్యవహరిస్తున్నారు. ఆటోలను వరుస క్రమంలో ఉంచేది మొదలు ప్రయాణీకులను ఎక్కించడం, వాటిని పంపించడం అంతా అక్కడ ట్రాఫిక్ విధులు నిర్వహించే సిబ్బంది కనుసన్నల్లో నడుస్తుంటుంది. టాటా మ్యాజిక్ ఆటోల నుంచి 50 రూపాయలు, చిన్న ఆటోల నుంచి 20 రూపాయలు లెక్కన పొద్దునే ఆ ప్రాంతంలో విధులు నిర్వహించే ట్రాఫిక్ పోలీసులు వసూలుచేసి పుస్తకంలో వ్రాసుకొంటుంటారట. డబ్బులిచ్చిన ఆటోలను ఎలాంటి ఆంక్షలు లేకుండా వారే దగ్గరుండి పంపుతుంటారు. లంచాల అమేథ్యం మేస్తూ బహిరంగంగా పోలీసులు చేస్తున్న నీచపు పనులు పోలీసుల పరువును బజారుపాలు చేస్తున్నాయి. మరోవైపు తమ వద్దకొచ్చిన వాహనాలను వాహన యజమానుల ఆచూకీ కనుక్కోకుండా వాటిని అక్రమంగా అమ్మి జేబులు నింపుకొంటుండడం పోలీసుల్లో దాగి ఉన్న నేరస్వభావాన్ని తెలియజేస్తోంది. ఇటీవల కొంతకాలంగా ఒకరి వాహనాలకు మరొక వాహనం తాళాలు పెట్టితీస్తే వచ్చేస్తున్నాయి. ఈ విధంగానే కిసాన్‌నగర్‌కు చెందిన పెంచలయ్య, ఇనమడుగు సెంటర్‌కు చెందిన కిరణ్‌లు ఆత్మకూరు బస్టాండ్ వద్ద ఉన్న బార్‌లో మద్యం సేవించేందుకు వచ్చి వాహనాలు పార్క్ చేశారు. తర్వాత పెంచలయ్య బైక్‌ను కిరణ్ వేసుకొనిపోగా అక్కడే ఉన్న కిరణ్ బైక్‌ను పెంచలయ్య టూ టౌన్ పోలీస్‌స్టేషన్‌లో అప్పగించాడు. ఇటీవల కిరణ్ బైక్‌పై వస్తుండగా పెంచలయ్య ఆపి అది తన వాహనమని చెప్పడంతో, కిరణ్ తన బైక్ చూపించమనగా పోలీస్ స్టేషన్‌లో ఉందని చెప్పి అక్కడకు వెళ్లగా వారు నిర్ఘాంతపోయే పరిస్థితి ఏర్పడింది. ఆ బైక్ స్టేషన్ నుంచి మాయమైంది. పోలీసులే ఈ బైక్‌ను అమ్మేసుకొని సొమ్ము చేసుకొన్నారనే ఆరోపణలు వస్తున్నాయి. వివాదం పెద్దది కావడంతో అది తమకు చుట్టుకొంటుందని భావించిన పోలీసులు వారితో రాజీ కుదుర్చుకునేందుకు బేరసారాలకు దిగడం అనుమానాలకు తావిస్తోంది.

# ఇంజనీరింగ్‌లో మంచి ఫలితాలు!

**నారాయణ ఘనత**



ర్యాంకులు సాధించిన విద్యార్థులతో ప్రిన్సిపాల్, అధ్యాపక బృందం.

జెఎన్‌టియూ విడుదల చేసిన ఇంజనీరింగ్ ఫస్టియర్ ఫలితాల్లో నారాయణ ఇంజనీరింగ్ విద్యార్థులు ఉత్తమ ఫలితాలు సాధించినట్లు ప్రిన్సిపల్ డాక్టర్ జి.జగదీశ్వర్‌రెడ్డి చెప్పారు. హరనాథపురంలోని కళాశాల ప్రాంగణంలో ఉత్తమ ఫలితాలను సాధించిన విద్యార్థులను అభినందించారు. ఈ సందర్భంగా ప్రిన్సిపల్ మాట్లాడుతూ తమ కళాశాలలో 62 శాతం ఉత్తీర్ణత సాధించారన్నారు. 143 మంది విద్యార్థులు 80 శాతం కంటే అదనంగా మార్కులు సాధించారన్నారు. ఈసీఈ విభాగంలో పి.రమ్యపూజిత 93.4 శాతం, ఎమ్.జ్యోత్స్న 92, టి.శశిరేఖ 92, ఎమ్.ముఖిత 91, ఈఈఈ విభాగంలో ఎమ్.సురేఖ 90 శాతం మార్కులు సాధించినట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో అకడమిక్ ఇన్‌ఛార్జ్ చంద్రమోహన్‌రెడ్డి, ఫస్టియర్ ప్రిన్సిపల్ పిఎం కిషోర్, వైస్ ప్రిన్సిపల్ సిఎస్ సాయిప్రసాద్‌రెడ్డి, కంట్రోలర్ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ యు.శివప్రకాష్ వివిధ విభాగాధిపతులు పాల్గొన్నారు.

# పెద్ద హోటళ్లలో పేకాట!

**● పట్టుకొంటే నేతల ఫోన్లు**

నెల్లూరు నగరంలో ఇటీవల కాలంలో పేకాట స్థావరాలు పెరిగి పోతున్నాయి. ఈ స్థావరాలను గుర్తించడంలో పోలీసులు వైఫల్యం చెందుతున్నారు. ఇంతకు ముందు నగర శివారులోని జనసంచారంలేని ప్రాంతాలను ఎంచుకుని పేకాట ఆడేవారు. శివారు ప్రాంతాలవైపు పోలీసులు వెళ్లరన్న ఉద్దేశంతో అక్కడే పేకాట ఆడేవారు. అయితే ఈ తంతు నగరం నడిబొడ్డున నిర్వహిస్తున్న విషయం తెలుసుకుని పోలీసులే ఆశ్చర్యపోవాల్సి వస్తుంది. పేకాట ఆడేవారిలో ఎక్కువగా ధనిక వర్గాలకు చెందిన వారు ఉంటున్నారు. ఇటువంటి వారు ఖరీదైన కార్లలో శివారు ప్రాంతాలకు వెళ్లేందుకు ఇష్టపడరు. ఇటువంటి వారి కోసం నగరం నడిబొడ్డున ఉన్న హోటళ్లలో రూమ్‌లు బుక్‌చేసి పేకాట నిర్వాహకులు తమ కార్యకలాపాలను కొనసాగిస్తున్నారు. ఖరీదైన హోటళ్లలో పోలీసులు తనిఖీలు చేసేందుకు వెళ్లరు. ఒక వేళ వెళ్లినా రాజకీయ నేతల నుంచి క్షణాల్లో ఫోన్లు వస్తుంటాయి. దీంతో ఎందుకొచ్చిన తంటా అనుకుని వెనుతిరుగుతుంటారు. అనుకోని పరిస్థితుల్లో మాత్రమే రూమ్‌లను తనిఖీ చేస్తారు. అటువంటి సంఘటన ఇటీవల చోటుచేసుకుంది. పోలీస్ స్టేషన్‌కు సమీపంలో ఉన్న హోటల్‌లో పేకాట ఆడుతున్న ఎనిమిది మందిని పోలీసులు పట్టుకున్నారు. హోటల్ నుంచి స్టేషన్‌కు తీసుకొచ్చేలోపే అధికార పార్టీకి చెందిన నేతల నుంచి ఫోన్ రావడంతో వారిలో ఇద్దరిని విడిచి పెట్టేశారు. పేకాట ఆడుతున్న వారి వద్ద దాదాపు లక్ష రూపాయల నగదు స్వాధీనం చేసుకుని తక్కువ మొత్తంలో చూపించినట్లు సమాచారం. ఈ విషయం బయటకు పొక్కడంతో ఎస్ఐను ఉన్నతాధికారులు చీవాట్లు పెట్టినట్లు తెలిసింది. నగరంలో ప్రతి పోలీస్ స్టేషన్ పరిధిలో పేకాట ఆడుతుంటారు. చిన్నా చితకా లాడ్జీలను తనిఖీ చేస్తున్న పోలీసులు పెద్ద హోటళ్ల వైపు కన్నెత్తి కూడా చూడకపోవడం విశేషం.

# ఐకెపి సిబ్బంది వేతనాల పెంపు

**పోరాడి సాధించారు**



తమ డిమాండ్లను డిఆర్వోకు వివరిస్తున్న ఐకెపి సిబ్బంది.

ఇందిర క్రాంతి పథం ఆధ్వర్యంలో స్వయం సహాయక సంఘాలను మెరుగు పరిచేందుకు పని చేస్తున్న సిబ్బందికి రాష్ట్ర ప్రభుత్వం వేతనాలు పెంచింది. కమ్యూనిటీ ఫెలిసిటేటర్స్, కమ్యూనిటీ రీసోర్స్ పర్సన్లు వేతనాలు పెంచాలని నిరాహార దీక్షలు చేపట్టిన సంగతి తెలిసిందే. ఈ దీక్షలపై స్పందించిన సెర్ప్ సిఇఓ రాజశేఖర్ వేతనాలు పెంచుతున్నట్లు ప్రకటించారు. ప్రస్తుతం 4600 రూపాయలు ఉన్న సిబ్బంది వేతనాలను 7650 రూపాయలకు పెంచడం జరిగింది. నిరాహారదీక్ష చేస్తున్న ఐకెపి సిబ్బంది వెంటనే దీక్షలు విరమించి విధుల్లో చేరాలని ఆయన కోరారు. విధుల్లో చేరకుంటే ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసుకోవాలని డిఆర్‌డిఏ పిడి అధికారులను ఆదేశించారు. అయితే నిరాహార దీక్ష చేస్తున్న సిబ్బంది మాత్రం వేతనాలు పెంచడంతోపాటు ఎన్నో సంవత్సరాలుగా పనిచేస్తున్న వారిని రెగ్యులరైజ్ చేయాలని డిమాండ్ చేస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం, సెర్ప్ అధికారులు స్పందించే వరకు నిరాహార దీక్షలు కొనసాగిస్తామని స్పష్టం చేస్తున్నారు. వీరి డిమాండ్‌పై ఇందిర క్రాంతి పథం అధికారులు ఏమాత్రం పట్టించుకునే దాఖలాలు కనిపించడం లేదు. పైస్థాయి అధికారుల దృష్టికి సమస్యను తీసుకెళ్లి వారి ఆదేశాల ప్రకారం ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేసే అవకాశం ఉంటుందని అధికారులు చెబుతున్నారు.

# పంచాయితీ కార్యదర్శుల దీక్షలు



ధర్నా చేస్తున్న పంచాయితీ కార్యదర్శులను ఉద్దేశించి మాట్లాడుతున్న బిజెపి నేత ఆంజనేయరెడ్డి.

జిల్లాలో గ్రామ పంచాయితీల్లో పనిచేస్తున్న కాంట్రాక్టు కార్యదర్శులు తమ సమస్యల పరిష్కారం కోసం జిల్లా కలెక్టరేట్ ఎదుట నిరాహారదీక్షలు ప్రారంభించారు. అనేక సంవత్సరాల నుంచి కాంట్రాక్టు ప్రాతిపదికన పంచాయితీ కార్యదర్శులుగా పనిచేస్తున్న వారిని వెంటనే పర్మినెంటు చేయాలని డిమాండ్ చేశారు. ఒక ప్రక్క కాంట్రాక్టు కార్యదర్శులను పర్మినెంటు చేయాలని డిమాండ్ చేస్తుంటే మరొక ప్రక్క కొత్తగా కార్యదర్శుల నియామకం చేపట్టేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. జిల్లావ్యాప్తంగా ఖాళీగా ఉన్న కార్యదర్శుల పోస్టులను భర్తీచేసే ముందు కాంట్రాక్టు కార్యదర్శులను ముందు పర్మినెంటు చేయాలని కోరుతున్నారు. ప్రభుత్వం స్పందించి తమ డిమాండ్లను ఆమోదించే వరకు ఈ దీక్షలు కొనసాగిస్తామని స్పష్టం చేస్తున్నారు. కాంట్రాక్టు కార్యదర్శులందరూ నిరాహారదీక్షల్లో పాల్గొనడంతో పంచాయితీల్లో పనులు స్తంభించి, పారిశుద్ధ్యం, తాగునీటి సరఫరాకు కొంతమేర అంతరాయం ఏర్పడింది. సర్పంచ్‌లు లేక అంతంతమాత్రంగా పనిచేస్తున్న పంచాయితీల అభివృద్ధి ఇప్పుడు కార్యదర్శులు ఆందోళన బాట పట్టడంతో మరింత కుంటుపడింది.

## కునుకులేని మంత్రులు

మొదటి పేజీ కొరవ

వుందని వాదించి, తప్పించుకొంటాడు. అది ముఖ్యమంత్రికి కానీ, కాంగ్రెస్ అధిష్టానానికి కానీ ఇష్టం లేదు. కేసులు దిట్టంగా వుంటే తప్ప జగన్ మాట వినడు. ఈ కేసులన్నీ న్యాయస్థానాలలో వగదేగేసరికి ఐదారేళ్ళు పడుతుంది. అప్పటివరకు జగన్‌ను నియంత్రించడానికి అధిష్టానానికి అస్త్రాలు వుంటాయి. ఇప్పుడు జిఓలు సక్రమమని సుప్రీంకోర్టుకు నివేదిస్తే ఈ అస్త్రాలు నిర్వీర్యమైపోతాయి.

అయితే కేసులు గట్టిగా నడపాలంటే, మంత్రులు బలి కాక తప్పదు. అందుకే మంత్రులలో అంత గుండె గాభరా. ముఖ్యమంత్రి వద్దకు మంత్రులందరూ కలిసి దాడికి వెళ్లారన్నది పరువు నిలుపుకోవడం కోసం పత్రికలలో వ్రాయించుకొన్న వార్త మాత్రమే. నిజానికి మంత్రులందరూ ముఖ్యమంత్రి వద్దకు కాళ్లబేరానికి వెళ్లారు. మమ్మల్ని గట్టెక్కించండి మహాప్రభో అని వేడుకొన్నారు. ధర్మాన ప్రసాదరావు రాజీనామాను ఆమోదించకూడదని, ఆయన్ను ప్రాసిక్యూట్ చేయడానికి అనుమతి ఇవ్వకూడదని గట్టిగా వాదించారు మంత్రులు. ఛార్జిషీట్ దాఖలైంది కాబట్టి మంత్రిపదవిలో కొనసాగకూడదనే నీతి మాటలు మాట్లాడితే, ధర్మానతో పాటుగా మరొక నలుగురు మంత్రులు కూడా ఆ వరసలో ఇదే ఇబ్బంది ఎదుర్కోవలసి వస్తుందన్నది వీరి వాదన. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి హయాంలో ఆయన చెప్పిన మాటను కాదనే ధైర్యం, పెట్టమన్న చోట సంతకం పెట్టనని చెప్పే సాహసం ఎవరికీ లేవని, తమ చేత పెట్టించిన సంతకాలతో తన కుమారుడి అక్రమ ఆర్జనకు దారులు పరుస్తాడని తాము కల కూడా కనలేదని, జగన్ లబ్ది కోసం మేము జైలుకు వెళ్లవలసి రావడం ఎక్కడి న్యాయం అని వాపోయారు వీరందరూ.

అయితే ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి వారికి సానుకూల హామీ ఇవ్వలేదు. నా చేతిలో ఏముంది, అంతా ఢిల్లీ మాయ అని సరిపెట్టేశాడాయన. మంత్రులను వదలుకొని జగన్‌ను శాశ్వతంగా అదుపు చేయడమా లేక మంత్రుల కోసం జగన్‌కు స్వేచ్ఛ కల్పించడమా అన్న సమస్య వచ్చినప్పుడు ఢిల్లీ పెద్దల మొగ్గు జగన్ శిక్ష మీద వుంటుందే తప్ప మంత్రుల మేలు వైపు వుండదన్నది నిజం. అధిష్టానం అటువంటి నిర్ణయం తీసుకొంటే నేను చేయగల్గింది ఏమి వుండదని చేతులెత్తేశాడు ముఖ్యమంత్రి. న్యాయపరంగానే మంత్రులు తగిన జాగ్రత్తలు తీసుకొని కేసుల నుంచి బయటపడాలని ఉచిత సలహా ఇచ్చాడు.

అయితే ఒకరికి ఆరుగురు మంత్రులు సిబిఐ కేసుల్లో ఇరుక్కొని, రాజీనామా చేయడమో లేదా జైలుకు వెళ్లడమో జరిగితే రాష్ట్ర ప్రభుత్వ ఉనికి ఎంతవరకు నిలుస్తుందన్నది సమస్య. అయితే ఢిల్లీలో బిజెపి వలే ఇక్కడ రాష్ట్రం రద్దు కావాలని గట్టిగా పట్టుబట్టే ప్రతిపక్షం లేకపోవడం ఒక అనుకూలత. అందువల్ల ఆరోపణలున్న మంత్రులను ముందుగానే తొలగించి ప్రభుత్వం పరువు కాపాడుకోవడం మంచిది కదా అన్న ఆలోచన కూడా ఢిల్లీ పెద్దలలో వున్నట్లు చెప్తున్నారు.

ఏది ఏమైనా ధర్మాన ప్రసాదరావు మీద సిబిఐ కేసు మంత్రులలో తీవ్ర కలవరం కల్గించింది. ఈ వరసలో పొన్నాల లక్ష్మయ్య, గీతారెడ్డి, సబితా ఇంద్రారెడ్డి, కన్నా లక్ష్మీనారాయణ వున్నారు. వీరికి కంటి మీద కునుకు పడితే ఒట్టు.

## వివేకా కుట్ర విఫలం

మొదటి పేజీ కొరవ

దాని ఆస్తులను, నిధులను తమ ఇష్టం వచ్చినట్లు దుబారా చేసే అధికారం కాలేజి కమిటీకి లేదు. ఆ కమిటీ కాల పరిమితి ఎప్పుడో ముగిసిపోయింది. ప్రభుత్వంలో తమకున్న పలుకుబడిని అడ్డం పెట్టుకొని వివేకానందరెడ్డి కమిటీ కార్యదర్శిగా అక్రమంగా కొనసాగుతున్నాడు. హిందు ధార్మిక సంస్థకు చెందిన ప్రాంగణంలో క్రైస్తవ మత ప్రార్థనా కేంద్రం నిర్మించి చట్టాన్ని ఉల్లంఘించాడు. ఎపి సుబ్బారెడ్డి, మేనకూరు ఆదిశేషారెడ్డి వంటి పెద్దలు దూర దృష్టితో పైసా పైసా కూడబెట్టి బ్యాంకులో దాచి వుంచిన ఫిక్స్‌డ్ డిపాజిట్ల సొత్తు దాదాపు పది కోట్ల రూపాయలు ఈ చర్చి నిర్మాణం పేరుతో, ఇతరత్రా కార్యకలాపాల పేరుతో దుర్వినియోగం చేసినట్లు ఆరోపణలున్నాయి. ఎబివిపికి చెందిన ఈశ్వర్ అనే యువకుడు ఈ తప్పుడు పనులన్నిటినీ ఎఐసిటిఇ దృష్టి తీసుకవెళ్లడంతో వారు విఆర్ కాలేజీకి ఇంజనీరింగ్ కాలేజి పెట్టే అర్హత అందుకు తగిన వసతులు లేవని నిర్ధారణకు వచ్చి, అనుమతి నిరాకరించారు. అందుకా యువకుడిని అభినందిస్తున్నాము.

## అస్సాంలో మానవ విషాదం

8వ పేజీ కొరవ

వైరభావం అట్లనే కొనసాగుతున్నాయి. ఖోక్రాజ్‌హార్ జిల్లాలోని బద్గాంగ్‌మారి అనే గ్రామంలో ముస్లింలు ఒక మసీదు కట్టుకోవడానికి అటవీ భూమిలో కంచె వేసుకొన్నారు. దాన్ని మాజీ బోడో ఉద్యమకారులు పీకి పారేశారు. ఈ సంఘటన మానిన గాయాలను రేపింది. ఘర్షణలు, ఒకటి రెండు హత్యలు జరిగాయి. ఇరు వర్గాల మధ్య ఉద్రిక్తత పెరిగిపోయింది. బోడో మిలిటెంట్లనే అనుమానంతో నలుగురు బోడో గిరిజనులను బెంగాలీ ముస్లింలు దాడి చేసి, కొట్టి, చంపారు. దానితో ఖోక్రాజ్‌హార్ జిల్లాలోని గ్రామాలన్నిటిలో పుకార్లు షికారు చేశాయి. ఇరు వర్గాలలో అభద్రతా భావం ఏర్పడింది. దానితో హింస పెరిగింది. పదిహేను రోజుల పాటు ఈ ఉద్రిక్తత కొనసాగి దాదాపు 60 మంది ప్రాణాలు పోగొట్టుకొన్నా, ప్రభుత్వం నుంచి సరైన స్పందన రాలేదు. కేంద్రం సైన్యాన్ని పంపితే తప్ప తమ పోలీసులు ఈ ఘర్షణలను అదుపు చేయలేవనే సాకుతో అస్సాం రాష్ట్ర ప్రభుత్వం మౌనంగా వుండిపోయింది. సైన్యం వచ్చే సరికి అల్లర్లు ఖోక్రాజ్‌హార్‌తో పాటుగా బోడోల్యాండ్‌కు సంబంధించిన నాలుగు జిల్లాలకూ పాకాయి. లక్షలాది మంది ప్రజలు భయంతో, ప్రాణాలు చేతపట్టుకొని, గ్రామాలు వదలి పారిపోయారు. ప్రభుత్వం ఏర్పాటు చేసిన శరణార్థుల శిబిరాలలో తలదాచుకొంటున్నారు.

### *ఆదుకొనేవారెవరు?*

ఇండియా, పాకిస్తాన్ విభజన సమయంలో జరిగిన అల్లర్లకు ఇది ఎంత మాత్రం తీసిపోదు. అప్పుడు సరిహద్దులకు ఇవతల, అవతల హింస చెలరేగింది. ఇప్పుడు ఒకే ప్రాంతంలో ప్రజలు ఒకరిని ఒకరు చంపుకొంటున్నారు. ఈ శరణార్థులలో బోడోలు, బెంగాలీ ముస్లింలు కూడా వుండడం గమనార్హం. ఇన్ని లక్షల మంది శరణార్థులను భరించే శక్తి, పోషించే సామర్థ్యం అస్సాం ప్రభుత్వానికి లేదు. కానీ అటు కేంద్రం కానీ, ఇటు దేశంలోని అసంఖ్యాక స్వచ్ఛంద సంస్థలు కానీ ఈ నిర్భాగ్యులను ఆదుకోవడానికి కనీసపాటి స్పందన కూడా చూపడం లేదు. భూకంపాలు, వరదలు, తుపాన్ల వంటి వాటికి బలయ్యే బాధితులను ఆదుకోవడానికి గొప్ప మానవత్వంతో ముందుకు వచ్చే దేశ ప్రజలు కూడా ఇన్ని లక్షల మంది జీవన వేదనను పట్టించుకోకపోవడం విచిత్రం.

### *మానసిక బంధం పెంచాలి!*

ఈశాన్య రాష్ట్రాల ప్రజలతో తతిమా దేశ ప్రజలకు మానసిక అనుబంధం లేకపోవడమే ఈ అనాసక్తికి కారణం కావచ్చు. ఆ బంధం పెంచవలసిన బాధ్యత ప్రసార సాధనాలది. కానీ దురదృష్టవశాత్తు మన టీవీ ఛానళ్లు, పత్రికలకు కూడా ఈ మారుమూల ప్రాంతం పట్ల అవగాహన లేదు. ఆసక్తి అంతకంటే లేదు.

దాదాపు రెండు నెలలుగా అస్సాం అగ్ని గుండంగా మారి వున్నా, దేశ ప్రజలలో నూటికి తొంభై శాతం మందికి దానిపై అవగాహన లేదు. ఒక్క ప్రసార సాధనం కూడా అందుకు ప్రయత్నం చేయడం లేదు. భారత దేశంలో తమిళులు, ఆంధ్రులు, మహారాష్ట్రులు, కాశ్మీరీలు, పంజాబీలు, బీహారీలు, బెంగాలీలుగా భారతీయులు కన్పించరని విదేశాల నుంచి వచ్చేవారు వ్యాఖ్యానిస్తూ వుంటారు. మనదొక దేశంగా, మనమొక జాతిగా మెలగే జాతీయ భావం, దేశభక్తి రోజురోజుకూ లుప్తమై పోతున్నాయి. భారతీయత అన్నది కవుల వర్ణనలకు మాత్రం పరిమితమౌతున్నది. అందువల్లనే ఇంత ఘోరమైన మానవ విషాదం మన దేశంలో నిరాఘాతంగా నడిచిపోతున్నది. చాలా బాధాకర పరిస్థితి ఇది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

జయంతి ఇందిరాభవన్‌లో పిసిసి కార్యదర్శి ఉడతా వెంకట్రావు నేతృత్వంలో ఘనంగా నిర్వహించారు. ఆయన చిత్రపటానికి పూలమాలలు వేసి, కేక్ కట్ చేశారు. ఈ సందర్భంగా ఉడతా వెంకట్రావు మాట్లాడుతూ యువత దేశానికి వెన్నెముకని, 18 ఏళ్ల యువకులకు రాజీవ్ గాంధీ ఓటు హక్కు కల్పించిన విషయాన్ని గుర్తు చేశారు. 73, 74 రాజ్యాంగ సవరణ ద్వారా నేరుగా పంచాయితీలకు నిధులు పంపించారని, సెల్‌ఫోన్లు, ఐటి రంగం స్థిరపడడానికి ఆయన చేసిన కృషి మరువలేనిదన్నారు. జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, పిసిసి బిసి సెల్ కన్వీనర్ కనకట్ల రఘురామ్ ముదిరాజ్, బాల సుధాకర్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## నిత్య కృషీవలుడు సవేరా శ్యామసుందర్‌రెడ్డి కన్నుమూత



దాదాపు యాభై ఏళ్లక్రితమే మద్రాసు నగరంలో మూడు నక్షత్రాల హోటల్ నిర్మించిన నెల్లూరు జిల్లా తొలితరం పారిశ్రామికవేత్త, సంపద ఎంత చేకూరినా శ్రమను మరచిపోని మార్గదర్శి అల్లారెడ్డి శ్యామసుందర్‌రెడ్డి 19తేది మరణించారు. ఆయన వయస్సు 76 సంవత్సరాలు.

శ్యామసుందర్‌రెడ్డి, కోట గ్రామంలో భూస్వామ్య కుటుంబానికి చెందినవాడు. అన్ని సంపన్న కుటుంబీకుల వలె వున్నది తినడంతో సంతృప్తి చెందలేదు. వ్యవసాయాన్ని వదలకుండానే పారిశ్రామిక రంగంలోకి అడుగు పెట్టాడు. కలిచేడులో సీతారామా మైనింగ్ కంపెనీ పేరుతో అభ్రకం గనులు నిర్వహించాడు. 1965లోనే మద్రాసుకు వెళ్లి, సవేరా పేరుతో మూడు నక్షత్రాల హోటల్ నిర్మించాడు. అప్పట్లో మద్రాసు పెద్ద పల్లెటూరు వలె వుండేది. అంత ఆధునికమైన హోటల్ నిర్మించడం ఆ దినాలలో పెద్ద సాహసం క్రింద లెక్క. కానీ అటువంటి సాహసాలు చేయడం శ్యామసుందర్‌రెడ్డి జీవనశైలి. ఈ యాభై ఏళ్లపాటూ సవేరా మద్రాసులో మంచి హోటల్ అన్న పేరు చెడకుండా నిర్వహించాడాయన. అమరావతి, మాల్గుడి, కరైకుడి వంటి పేర్లతో మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు నగరాలలో భోజన హోటళ్లు చాలానే స్థాపించాడు. చిల్లకూరు దగ్గర శ్యాం విన్సెల్స్ అనే కర్మాగారం నెలకొల్పాడు. అక్కడే రుచి పేరుతో పచ్చళ్ళ పరిశ్రమ ప్రారంభించాడు. అయితే ఇవి రెండూ ఎక్కువ కాలం నడవలేదు. రొయ్యల పెంపకం జోరుగా నడిచిన కాలంలో ఇస్కపల్లి వద్ద ఆ ప్రయోగమూ చేశారు. వూరకే పెట్టుబడి పెట్టడం కాదు, రాత్రిపగలు ఆ సముద్ర తీరంలో ఉప్పుగాలికి వెరవకుండా కష్టపడ్డాడు. శ్యామసుందరరెడ్డి ప్రత్యేకతే అది. ఏ పని చేసినా చిత్తశుద్ధితో, శ్రమ అనుకోకుండా ఫ్యాక్టరీ కార్మికుడి తరహాలో పని చేసే వాడాయన.

కోట గ్రామంలో కట్టిన ప్రతి ప్రభుత్వ కార్యాలయానికీ స్థలాన్ని ఉచితంగా ఇచ్చాడు శ్యామసుందర్‌రెడ్డి. ఖరీదైన తన పొలాన్ని ఇళ్ల స్థలాలుగా మార్చి, దాదాపు 500 మంది పేదలకు గూడు కల్పించాడు. కళ్యాణ మండపాలు నిర్మించాడు. ఆయన వదాన్యతలో గొప్పగా చెప్పుకోదగినది – గూడూరు టౌన్‌లోని డిఆర్‌డబ్ల్యు కాలేజి, డిఎన్ఆర్ కమ్యూనిటీ హాళ్ల నిర్మాణం. ఆ విద్యా సంస్థలు ఒక తరానికి పైగా గూడూరు వాసులకు విలువైన విద్యాదానం చేశాయి.

ఎంతకు ఎత్తుకు ఎదిగినా ఒదిగి వుండడం శ్యామసుందర్‌రెడ్డి సులక్షణం. తాను సంపన్నుడిననే భావన ఎవరిలోనూ కల్గించకుండా, వినయంతో మసలుకొనే వాడు. ఆయన మృతికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

## జనవాణి

2వ పేజీ కొరవ

తాయి. కొన్నిసార్లు ఐదారు గంటలు నీళ్లు రాకపోతే మినరల్ వాటర్‌తో శుభ్రం చేసుకోవాల్సిన దుస్థితి. రైళ్ల పరిశుభ్రత కోసం రైళ్లలో ప్రయాణించే హౌస్ కీపింగ్ స్టాఫ్ హాయిగా పేకాడుకుంటూ కాలక్షేపం చేస్తుంటారు. టాయిలెట్ల సౌకర్యం కారణంగానే రైలు ప్రయాణాల పట్ల ప్రజలు మొగ్గు చూపుతుంటారు. అటువంటిది వాటిని పరిశుభ్రంగా వుంచడంలో రైల్వేశాఖ దారుణంగా విఫలమవుతుంది.

పి.అరుణకుమారి నెల్లూరు

## సాహసికి అన్నపూర్ణయ్య అవార్డు!

'జమీన్‌రైతు' రాష్ట్రంలోనే అత్యంత సాహసోపేతమైన పత్రిక. దాని సంపాదకుడు నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ ఎంతో గుండెధైర్యం, కలం బలం గల వ్యక్తి. ఆయన వ్రాసే సంపాదకీయాలు, నెల్లూరు రాజకీయాలు, ప్రత్యేక వార్తలు మళ్లీమళ్లీ చదవాలనిపిస్తాయి. అటువంటి ఆయనను మరో సాహసీకుడు మద్దూరు అన్నపూర్ణయ్య అవార్డుతో రాష్ట్ర ప్రభుత్వం సన్మానించడం నెల్లూరీయులకందరికీ ఆనందకరం.

వాస్తు రామచంద్ర నెల్లూరు

## పదరంగం -30

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | | 3 | 4 | 5 | | 6 |
| | | | | | 7 | | | | | |
| 8 | | | | | | | | | | 9 |
| | | | | | 10 | | 11 | | | |
| | 12 | 13 | | | | | | | | |
| 14 | | | | 15 | | 16 | | | 17 | |
| | | | 18 | | | 19 | | | 20 | 21 |
| 22 | | 23 | | | | | | 24 | | |
| | | 25 | 26 | | 27 | | 28 | | 29 | |
| 30 | 31 | | | | | | 32 | | | |
| | | | 33 | | | | | | | 34 |

**అడ్డం**

1. నిజ పరిశోధన (5)
3. వక్కలు (3)
6. ఇంగ్లీషు కాకి (1)
7. గూఢచారులు (5)
8. సర్పయాగం చేసిన రాజు. మధ్యలో 'మే' నెల వున్నవాడు (6)
10. కలలో పలవరింతలు (6)
12. మన్మధుడు (3)
16. ఎక్కువగా (4)
18. బండ, రాయి (2)
19. తినడం, అసమాపక క్రియ (2)
20. పిండితే వచ్చేది, చారు (2)
22. రోలుకు జతగాడు (3)
24. ఇంగ్లీషులో వద్దని చెప్పండి (1)
25. ఆ మానవులు నీచమైనవారు (6)
29. బంగారం (2)
30. అటు నుంచి అంతిమ శిక్ష (2)
32. సన్మార్గం కాదు (3)
33. శివుని వాహనంతో తెల్లని పూవు (5)

**నిలువు**

1. సరియైనది అంగీకరించ తగ్గది (4)
2. ధనుర్ధారి అర్జునుడు (5)
3. కుప్ప, రాశి (2)
4. స్వప్నం (2)
5. క్రింద నుంచి వాటం (2)
7. సంబరాలు (4)
9. యముడు (3)
11. ప్రవరుని వరించిన గంధర్వ కన్య (4)
13. మోక్షం (2)
14. రుధిరం కలిగిన ఒక తెలుగు సంవత్సరం. రక్తాక్షికి ముందు సంవత్సరం (5)
15. పిన్న వయస్కురాలు ...త్రిపుర సుందరి (2)
16. ఎక్కువ, మితిమీరినది (2)
17. పంటి మీద చార (2)
21. అసంపూర్ణం కాదు, పూర్తిగా (3)
23. క్రింద నుంచి బులుగు రంగు (2)
26. కదలిక (3)
27. క్రింద నుంచి కాబట్టి పంచమీ తత్పురుషం (3)
28. వృషభాలు క్రింద నుంచి వస్తున్నాయి (3)
29. నరకానికి వ్యతిరేకం (2)
31. లవణం (2)
34. ఆంగ్లంలో చెట్టు (1)

**సమాధానాలు**

## పదరంగం -29

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1అ | ప్ర | తి | 2హ | తం | 3గా | | 4గ | ర | 5ళం | |
| వ | | | రి | | 6లి | 7ఖి | తం | | 8ర | 9మ |
| 10న | 11వ | 12నీ | త | 13ము | | ల్లా | | 14ము | త | గ |
| 15తం | డు | ల | ము | లు | | | 16త్రి | | | టి |
| | గు | | | 17కు | 18లు | 19కు | | 20చె | లి | మి |
| | | | 21టూ | | 22గో | ల | | లి | | |
| 23శ | ర | 24ణం | | | | 25ప | లా | య | నం | |
| మం | | ర | | 26స్పా | | తి | | లి | | 27గా |
| త | | హ | | 28రు | పో | | 29కో | క | | ర |
| 30క | మ | ల | | గ్గ | | | 31న | ట్ట | 32న | డి |
| ము | | 33కా | వ | డి | కుం | డ | లు | | టి | |

# సంక్షిప్త సింహపురి

## నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ వితరణ!

నెల్లూరు ఆచారివీధిలోని ది నెల్లూరు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో ఆగస్టు 15తేదిని పురస్కరించుకొని సంఘం అధ్యక్షులు నాగసూరి కామేశ్వరరావు జాతీయ పతాకావిష్కరణ చేశారు. అనంతరం గాంధీ బొమ్మ సెంటర్‌లోని మహాత్ముని విగ్రహానికి పుష్పమాల వేసి భక్తవత్సల నగర్‌లోని మదర్ థెరిస్సా హోమ్‌కు వెళ్లి అక్కడున్న వారికి పండ్లు, బిస్కెట్లు పంపిణీ చేశారు. అక్కడ నుంచి వాత్సల్య అనాధాశ్రమానికి వెళ్లి పండ్లు, బిస్కెట్లు ఇచ్చారు. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్షుడు నాగసూరి కామేశ్వరరావు, ప్రధాన కార్యదర్శి చలువాది నాగేశ్వరరావు, ఉపాధ్యక్షులు వి.సాంబశివ రావు, గౌరవ సలహాదారులు అచ్యుత సుబ్రహ్మణ్యం, డి.నరసింహారావు, ఆర్గనైజింగ్ కార్యదర్శి శ్రీరాం సుబ్బారావు, సహకార్యదర్శి అచ్యుత బాబా రావు, కార్యవర్గ సభ్యులు రాజా హజరత్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

## వేదవ్యాస స్కూల్‌లో ఆగష్టు 15!



నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస స్కూల్‌లో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా నిర్వహించారు. ప్రధాని మన్మోహన్‌సింగ్ వేషధారణలో ఉండిన మూడవ తరగతి విద్యార్థి వసీం అబ్బాస్ చేత స్కూల్ కరస్పాండెంట్ ఎ.పి.బాలాజీ జాతీయ జెండా ఎగురవేయించారు. అనంతరం స్వాతంత్ర్య సమరయోధుల గూర్చి విద్యార్థులకు తెలియజెప్పారు. స్కూల్ పిల్లలు జాతిపిత, నెహ్రూ, అల్లూరి సీతారామరాజు, సుభాష్‌చంద్రబోస్ వేషధారణలో అలరించారు. 2011-12లో స్కూల్‌లో పదవ తరగతి చదివి టాపర్‌గా నిలచిన వారికి బహుమతులందించారు. స్కూల్ డైరెక్టర్ ఎపి.వేదగిరి కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## 362 కోట్లతో మెడికల్ కాలేజీ!

స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో భాగంగా ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి పోలీసు పెరేడ్ గ్రౌండ్‌లో జాతీయ జెండా ఆవిష్కరించి పోలీసు గౌరవ వందనాన్ని స్వీకరించారు. అనంతరం జిల్లా అభివృద్ధి ప్రణాళిక గూర్చి మాట్లాడారు. నెల్లూరు ప్రజల చిరకాల స్వప్నమైన మెడికల్ కాలేజిని 362 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మిస్తామన్నారు. దీనిలో 150 సీట్లు వుంటాయన్నారు. సోమశిల ఎత్తిపోతల పథకానికి 850 కోట్ల రూపాయలతో పరిపాలనా పరమైన అనుమతులు మంజూరు చేశామన్నారు. రూపాయికే కిలో బియ్యం, రాజీవ్ యువకిరణాలు, ఇందిర జల ప్రభ, ఉపాధి హామీ పథకం, వడ్డీలేని రుణాలు, ఇందిరమ్మ గృహ నిర్మాణం, ఆరోగ్యశ్రీ తదితర అభివృద్ధి సంక్షేమ కార్యక్రమాల అమలులో మన జిల్లా ముందంజలో వున్నదన్నారు. జిల్లాలో రబీ సీజన్‌లో దాదాపు 5లక్షల ఎకరాల విస్తీర్ణంలో పంటలు పండించేందుకు ప్రణాళిక రూపొందించామన్నారు. ఈ సంవత్సరం 50 శాతం సబ్సిడీతో 2,363 మంది రైతులకు 36వేల మెట్రిక్ టన్నుల ఎరువులు, 15,100 క్వింటాళ్ల విత్తనాలు పంపిణీ చేశామన్నారు. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా అందిస్తున్న నిత్యావసర సరకుల వివరాలు లబ్దిదారులకు తెలియజేయడంతోపాటు సకాలంలో సక్రమంగా పంపిణీ చేసేలా ఉద్దేశించబడిన ఈ-వాణి కార్యక్రమాన్ని రాష్ట్రంలో మొట్టమొదటిసారిగా జిల్లాలో ప్రారంభిస్తున్నట్లు మంత్రి చెప్పారు.

## సెయింట్ పీటర్స్‌లో స్వాతంత్ర్య దినోత్సవం!




సెయింట్ పీటర్స్ వాకర్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. ముఖ్య అతిథిగా విచ్చేసిన స్కూల్ కరస్పాండెంట్ ఆంటోని రాజ్ స్వాతంత్ర్య సమరయోధుడు ఆర్.దేవదానంను సత్కరించారు. వికలాంగులకు మూడు చక్రాల సైకిళ్ల పంపిణీ జరిగింది. 65 సంవత్సరాలు నిండిన సంఘ సభ్యులను సన్మానించారు. ఈ కార్యక్రమంలో అసోసియేషన్ అధ్యక్షులు వెంకటేశ్వరరావు, కార్యదర్శి నరసింహారావు, డాక్టర్ అంకిరెడ్డి, సభ్యులు రాజారావు, తిరువీధి కిషోర్, మంచికంటి సుబ్రహ్మణ్యం, ఈశ్వర్ తదితరులు పాల్గొన్నారు.

## విశిష్ట సత్కారాలు

స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని పోలీసు పెరేడ్ గ్రౌండ్‌లో స్వాతంత్ర్య సమరయోధులు రావిపూడి దేవదానం, నాటక రంగంలో విశిష్ట సేవలందించిన తిరుపతి హరగోపాల్, క్రీడాకారులు వివి.కృష్ణమూర్తి, యోగాలో పరిపూర్ణత సాధించిన జషితారెడ్డి, నృత్యకళాకారిణి జాహ్నవి, నాదస్వర విద్వాంసులు కె.పెంచలయ్య, గాత్ర విద్వాంసురాలు ఎ.లక్ష్మీ ప్రసన్న, డప్పువాయిద్య కళాకారుడు కల్లు శ్రీనయ్య, సంగీత గాత్ర విద్వాంసురాలు శ్రీమతి రాళ్లపల్లి సుబ్బలక్ష్మిలను ప్రభుత్వం తరపున ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి సన్మానించారు.



రైతు లోకం

# పైర్లకు పొటాష్ ఎంతో మేలు!

వివిధ రకాల పంటలకు పొటాష్ ఎరువు ఎంతో మేలు చేస్తుంది. దీనిని వాడటం వల్ల దిగుబడులు సన్నగిల్లకుండా చూసుకోవచ్చని వ్యవసాయ శాఖాధికారులు రైతులకు సూచిస్తున్నారు. వరి, మొక్కజొన్న పంటల్లో మొక్కల కాండం గట్టి పడేందుకు, పైరు నీటి ఎద్దడి తట్టుకొనేందుకు, గింజల్లో తాలు లేకుండా వుండేందుకు పొటాష్ ఎంతగానో తోడ్పడుతుంది. చెరకులో అయితే పంచదార శాతం, రస నాణ్యత పెరుగుతుంది. బంగాళదుంప, క్యారెట్, చిలగడ దుంప లాంటి పంటల్లో దుంపల పూరకాన్ని పెంపొందిస్తుంది. ఆయా పైర్లు అధిక వేడి, చలి, వర్షాభావ పరిస్థితులను తట్టుకుంటాయి. కూరగాయలు మంచి రంగు, నాణ్యత కలిగి ఎక్కువ రోజులు నిల్వ వుంటాయి. పొగాకు నాణ్యత మెరుగుపడుతుంది. చౌడు నేలల్లో, నీటి ముంపునకు గురైన భూముల్లో ఇనుప ధాతు లోపం వల్ల ఎదురయ్యే దుష్ఫలితాలను తగ్గిస్తుంది. పంటకు పైపాటుగా వేసే నత్రజని, భాస్వరం, గంధకం, జింకు పోషకాలను మొక్కలు వినియోగించుకొనేలా సహాయపడుతుంది.

**పొటాష్ లోపిస్తే:** మొక్కల పెరుగుదల సన్నగిల్లుతుంది. వరిలో ఆకులు సన్నగానూ, ముదురు ఆకుపచ్చ రంగులో వుండి కొనలు మాడినట్లుంటాయి. పిలకల సంఖ్య గణనీయంగా తగ్గుతుంది. చెరకు ఆకు కొన నుంచి అంచుల వెంబడి గోధుమ రంగుకు మారుతుంది. పత్తిలో ఆకుల ఈనెలు పసుపు రంగులోకి మారి ఈనెల మధ్య భాగం ఎర్ర బారుతుంది. పొగాకులో ఆకులు ముడుచు కొని క్రిందకు వంగి గోధుమ రంగుకు మారుతాయి.

**పొటాష్‌నిచ్చే ఎరువులు:** మ్యూరేట్ ఆఫ్ పొటాష్, సల్ఫేట్ ఆఫ్ పొటాష్‌గా లభ్యమవుతాయి. మ్యూరేట్‌లో 60% పొటాష్ వుంటుంది. కొన్ని మినహా చాలా రకాల పంటలకు ఈ ఎరువును వాడవచ్చు. పొగాకు, బంగాళదుంప, నిమ్మ, చెరకు పైర్లకు సల్ఫేట్ ఆఫ్ పొటాష్ మేలు. దీనిలో 50% పొటాష్ వుంటుంది. సేంద్రీయ ఎరువులైన కోళ్ల ఎరువులో 1.4శాతం, పశువుల ఎరువులో 0.5 – 0.6 శాతం, వేపపిండిలో 1.4శాతం, ఆముదం పిండిలో 1.3శాతం పొటాష్ వుంటుంది. ముఖ్యంగా పైర్లకు పొటాష్ ఎరువులను ఆఖరి దుక్కిలో వేయాలి. తేలిక నేలల్లో ఒకేసారి కాకుండా దఫాలుగా వేసుకోవాలి. వరికి నాటేటప్పుడు సగం, మిగతా సగం పైపాటుగా యూరియాతోపాటు వేసుకోవాలి. పత్తి పంటకు విత్తిన 30, 60, 90 రోజులకు మూడు దఫాలుగా వేసుకోవచ్చు. బరువు నేలల్లో విత్తేటప్పుడు పూర్తి మోతాదుగా కానీ లేదా 30 రోజుల తర్వాత గానీ వేసుకోవాలి. 




కే॥శే॥ అల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి గారు

ఫౌండర్ & ఛైర్మన్ : సవేరా గ్రూప్ ఆఫ్ హోటల్స్,

(చెన్నై, బెంగళూరు, హైదరాబాదు, మైసూర్)

శ్యామ్ గ్రూప్ ఆఫ్ హోటల్స్, సీతారామ మైనింగ్ కంపెని.

**గమనిక :** 30.08.2012 గురువారం సాయంత్రం 5 గంటలకు గూడూరు డిఎన్ఆర్ కమ్యూనిటీ హాలు నందు సంతాప సభ జరుగును.



# ఉత్తరక్రియలు



మా ఇంటి జ్యోతి, నిరంతరం మా హృదయాంతరాలలో
వెలిగే ధృవతార, మా అభివృద్ధికి కారకులు,
అనురాగంతో మమ్మల్ని తన గుండెలలో దాచుకున్న
శ్రీ అల్లారెడ్డి శ్యామసుందరరెడ్డి గారు
తేది 19-08-2012 ఆదివారం చెన్నైలో స్వర్గస్తులైనారు.
వారి ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుని ప్రార్థిస్తూ...
శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

భార్య : అల్లారెడ్డి జయలక్ష్మమ్మ

కుమారులు - కోడళ్లు

అల్లారెడ్డి విజయకుమార్‌రెడ్డి - నీనారెడ్డి
అల్లారెడ్డి రవికుమార్‌రెడ్డి - ప్రియంవదరెడ్డి

మనుమలు - మనుమరాళ్లు

తరుణ్‌రెడ్డి, 'నివృతిరెడ్డి - స్కంద', శ్రావ్య, రితిక
మరియు మేనేజ్‌మెంట్ & స్టాఫ్

## ఉత్తరక్రియలు

తేది 28-08-2012 మంగళవారం "శిలాప్రతిష్ఠ"
తేది 29-08-2012 బుధవారం "ఎత్తురేవు, బ్రాహ్మణబియ్యాలు"
నెం.9, రివర్‌వ్యూరోడ్డు, కోటూరుపురం, చెన్నైలోని
వారి స్వగృహము నందు జరుగును.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com